# 'అహల్య.'

ఇది

శ్రీ మొలవరం రాజావారి ఆస్థానపండితులు

విద్వత్కవి - నాటకచక్రవర్తి బిరుదాంకితులు :

**బ్రహ్మశ్రీ మల్లాది అచ్యుతరామశాస్త్రిగారిచే**

రచియింపబడినది.

ఇంపైన పాటలు :

**సంపన్ముడుంబ శ్రీనివాసాచార్యులుగారిచే**

వ్రాయించబడెను.

△

ప్రకాశకర్తలు :

కాళహస్తి తమ్మారావు అండు సన్సు.

సంస్కృతాంధ్ర బుక్ డిపో : : రాజమహేంద్రవరము.

△

స్వకీయం :

శ్రీరాజేశ్వరీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె,

రాజమహేంద్రవరము.

△



1947

మూల్యం 1—8—0.

# ఇందు వచ్చు పాత్రలు.

## పురుషులు

1. బ్రహ్మ
2. ఇంద్రుడు
3. గౌతముడు
4. దశరథుడు
5. విశ్వామిత్రుడు
6. రాముడు
7. లక్ష్మణుడు
8. శతానందుడు
9. ఋషికుమారుడు
10. సుమంత్రి
11. భటుడు

(మహేంద్రుడు ము॥ శిష్యులు)

## స్త్రీలు

1. సరస్వతి—బ్రహ్మభార్య
2. అహల్య—గౌతమునిభార్య
3. సునంద—చెలికత్తె
4. శచి—ఇంద్రునిభార్య



# అహల్య.

## ప్రథమాంకము.

మొదటి రంగము—బ్రహ్మసభ.

[ అహల్య, సరస్వతి, గౌతముఁడు. ]

బ్రహ్మ :—ఎంతమంది ప్రయత్నించినను కర్మవాదియగు గౌతమున కీసంబంధముకలుగుట మనకుం దగినది.

గౌత :—బ్రహ్మాండప్రదక్షిణాసమయమున దేవేంద్రుఁ డప్రయత్నము మానుఁడని పలువిధములుగాఁ జెప్పినాఁడు.

బ్రహ్మ :—పందెమును గెలువ నిచ్ఛగలవారలు పరుల నిగ్రహములఁ జేయ నెంతురు.

సరస్వతి :—తపో మహిమకు సర్వము సర్వశక్తులు లోబడియుండును.

బ్రహ్మ :—అంతియకాదు. ఉభయతోముఖగో ప్రదక్షిణమే యీ విజయమునకుం గారణము. అమ్మాయి ! పుష్పమాలిక నీ మగని మెడలో వేయుము. మంచికాలము సిగ్గుపడకుము.

సరస్వతి :—ఇటురమ్ము. (తీసికొనివచ్చును.)

అహల్య :—(సిగ్గుపడుచు పుష్పమాలికను వేయును.)

బ్రహ్మ —అమ్మాయి ! మానసికమున ననేకబ్రహ్మాండములు సృజించినను వానియందు కలిగిన మమత్వము సామాన్యము సహవాసదోషమునఁ గలిగిన మోహము వియోగమును భరింపఁజాలదు. విశేష దుఃఖకారణము.

సరస్వతి :—

సీ. పెనిమిటి మాటలు వేదవాక్యములట్లు
మదిలోనఁ దలఁచుట మంచిదమ్మ
సహధర్మచారిణి ఛాయరీతిగ వాని
పనులను నెరవేర్పవలయునమ్మ
యభ్యాగతుల కేమి యతిథిసంతతి కేమి
సంతోషమున సేవ సలుపుమమ్మ
ఒంటిపొద్దులుగాని యుపవాసములుగాని
నాథునితోపాటు సలుపుమమ్మ

గీ. అగ్నిపూజలు భక్తితో నాచరించి
బంధుగుల కెల్ల తలనాల్కవలెను మె:
పుట్టినింటికి విఖ్యాతిఁ బొందఁజేసి
మంచి దీయమ్మయని యనిపించుకొనుము.

తల్లీ! నిత్యము నీకు బోధించు సద్ధర్మములు మఱువకుము. సతు[illegible] [illegible] జాతకముల కేగి, కానిపోనిపింగలు తల[illegible] [illegible] మోఘమగు [illegible] మాటలాడి. భర్తృ[illegible] [illegible] సాటియగు వలువలు ధరించవలయునుగాని భర్తయొక వేషము, భార్యయొక వేషము నగుదుమా?

అహల్యా :— జననీ! నీకడుపునఁ బుట్టినను బుట్టకున్నను నాకు తల్లివి నీవేకదా? నీచేతఁ బెంచఁబడిన నేను విపరీతముగా సంచరింతునా?

ధానశ్రీ — త్రితాల్.

అమ్మా విచారించకుమా - అంతరంగమునను నాకొరకు నీ విపు ॥ప॥
సమ్మోదమునన్ మీ యాజ్ఞను శిర - సావహింతు నెన్నటికేని ॥అ॥
మీ యుద్బోధకను - సుతనగు నేనా - మేదిని విపరీతముగ నడతు నా
నాయకునకు నొక్క యోగంబునా - నారీమణి కొక్క యోగంబునా

చుట్టాలసురభి యీ సుందరాంగియటంచు
బాంధవావళిఁ జేరు వడయుమమ్మ
పతిదేవ యీ భామ పరమసాధ్వియటంచు
నిలువు టాంగ్రజాపే రొందుమమ్మ
గీ. భర్తృపదసేవ సద్బ్రహ్మ పదమటంచు
దలఁచి యణుమాత్రమైనను తప్పకుండ
సలుపుచుండుము నాకది చాలు తల్లి
చెప్పఁదగినది యింతె మా యమ్మ వినుము.

అయ్యా! పునర్దర్శనము గోరుచున్నాము.

గౌత:—(సరస్వతీ బ్రహ్మలకు నమస్కరించవలయును.)

బ్రహ్మ:—సుఖముగా బోయిరండు. (అందరు నిష్క్రమింతురు.)

ప్రథమాంకము—సమాప్తము.

# అహల్య.

## ద్వితీయాంకము.

### ప్రథమరంగము.

ఇంద్రుడు:—(స్వగతము) నా యాశాసముదాయమంతయు క్షణములో భగ్నమయిపోయినది. నా ప్రయత్నములన్నియు కృతఘ్నుని కింజేయు నుపకారములవలె నీటిలో వ్రాతలువలె పరిహాస్యములయి పోయినవి. తుట్టతుదకు పరమచ్ఛాందసుడగు గౌతముడు నాతో ప్రతిఘటించువాడా? ఈ పరాభవము దేవేంద్రుడు సహింపవలయునా? ఎట్లు సహించును?

సీ. ప్రాణంబుగలిగిన బంగారుపుత్రిక
నడయాడ నేర్చు స్వర్ణంపులతిక
యమృతసాగరవీచి యవనిపై దిరుగాడ
వచ్చిన చంచలావల్లి మొలక
శృంగారములమూట మాంగల్యములకోట
రమ్యమౌ గుణరాజి రాజబాట
సుగుణంబులకు కోట సొగసుల పెన్బాట
సౌందర్యవారాసి చలువతేట

గీ. మక్కువకొటారు వలపుల మందిరమ్ము
తళుకులబజారు హొయలుల దమ్మిమొగ్గ
సిరుల నట్టిల్లు యందంబు జిలుకుతేనె
పట్టు, కొట్టి కాజేసె నా బ్రాహ్మణుండు.

గీ. వజ్రఘాతమ్ము నోర్చెడు పర్వతమ్ము
దావవహ్నికి నెదిరించ దలంచు వనము
పేరుమాయక నిలిచెడు దారి కలద
మోసమాయెను గౌతమ మునికి నిపుడు.

(తెలివితో) మోహపిశాచము నిశ్చయముగా నన్ను పిశాచవానిని జేసినది. విధివతుగాఁ బదుగురిని మెప్పించి వివాహముచేసికొనిన గౌతముని పై నాకీకోపమెందుకు! నీవే ధన్యాత్ముఁడవు. ఈ పాటికి నా సౌందర్యవారాసి, యభినవయౌవనామృతమును పరిపూర్ణముగా గ్రోలియుండువు గాఁబోలు! దిక్కుమాలిన ధర్మశాస్త్రము నా ప్రాణమునకు శల్యప్రాయమైనదే. నా గ్రహచారము. ఆ గోప్రదక్షిణపుసంగతి నాకేల జ్ఞాపకము రారాదు? అసలు ఈ స్వయంవరమె కుచ్ఛితముగా జరిగినది. (అని విస్మృతిఁ జెందును.)

రెండవ రంగము.

శచి:—నేననుకొనినదంతయు సంపూర్ణమయినది. ప్రమతిమించి రాగములోనికిఁ దిగినది. (ప్రకటముగా) నాథా! ఎందుకీదీర్ఘక్రోధము ప్రయత్నించుకార్యములన్నియు సఫలములగునా? ఈ యహల్య మిమ్ము వరించినంతమాత్రమున మీ చిరబ్రహ్మచర్యపు చెరగిపదలేదా? మీకాపాటి యాడది లభింపదా? భవద్యౌవనసౌభాగ్యామృతము తనివిదీరఁ జూరగొను మహాభాగ్యశాలినులు కోటానుకోట్లు నిత్యయౌవనులై సమయమునకు నిరీక్షించుచు నాకలిగొనిన బాలవత్సములు స్తన్యములకై యెదురుచూచునట్లు క్షణములు యుగముగాఁ గడుపుచున్న బిబ్బోకవతులకన్న నెక్కువదియా? మనుజకాంత ప్రతిక్షణాపగతయౌవన. తమ కీప్రకృతివికార మేలజనించినదో యభిప్రాయముగాక యున్నది. యెక్కడ చిక్కదు కాఁబోలు!

ఇంద్రు :—ఛిక్కను. నిక్కముగాఁ జిక్కను. ప్రకృతిసృష్టిలో, లోకత్రయాతీత సరికదా! భావిసృష్టిలో విరళ. భూతసృష్టిలోలేదని నిర్ధారణమే. స్త్రీయన నహల్యగాని మఱియొకతె కానేరదు. మిగిలిన స్త్రీజాతి దారుమయ స్త్రీపుత్రికలవలె నామమాత్ర స్త్రీలు. విద్యావినయవిలాసములా యపూర్వములు, అభూతపూర్వములు ఇటువిను.

సీ. పూర్ణచంద్రునిడాలు పురుడింపఁగాఁజాలు
తరళాక్షి నెమ్మోము తళుకుకళలు
జాళువా మెఱుఁగుల మాలింపఁగాఁజాలు
చానయందంపు నెమ్మేనిహొయలు
మధుకరంబెలబారు మండలింపఁగఁజాలు
కామినీమణి పెద్ద కనులసోకు
తెలిముత్తెములనిటు పేటనూటాడించు
సరసిజేక్షణ పలువరుసనంచు
గీ. అందములకోట యాణిముత్యాలకోవ
మోహములమందు సొగసుల ముద్దుగుమ్మ
కలుములకుఁ దావు యమృతంబు లోలకప్రోవి
సాటిలేనిది యాఁబోఁటి చానమిన్న.

శచి :—కాముకులకు నది స్వభావగుణము. తానలచినది రంభ, తా మునిగినది గంగ. ప్రతిక్షణాపాయజీవితయగు గౌతమాంగన, స్వర్గసంభవినీసౌందర్యకదంబంబుకన్న మిన్నయా? కామినీవ్యామోహకామితాంకకళంకితములగు మఘవానుని కనులకు సౌందర్యఖనియై గనుపడిన పట్టవచ్చు, యథార్థముగా నాకలోక చకోరాక్షులకన్న మనుష్యాంగన లావణ్యవతియా?

ఇంద్రు :—స్వాభిమానము. పరులయందు దోషారోపణ మొనర్చఁజేయును గాన మన కిన్నరాంగనలు, మనతురంగముఖులు, కురంగిలపనులుకన్న వేయిరెట్లు చక్కదనముగలవారు మనుష్యస్త్రీలు.

సీ. స్వర్గంబుతో నన్ను సాగనంపఁగ నెంచి
ప్రతిసృష్టి సల్పిన వాఁడెవండు
స్వర్గరాజ్యముఁ నంత సంద్రంబులో జొన్పి
దారిద్ర్యమిచ్చిన ధన్యుఁ డెవఁడు
దేవతావళి కెల్ల దివ్యాన్నము లొసంగి
పోషించుచుండెడి పుణ్యులెవరు
రాక్షసానీకమ్ము రాజ్యమ్ముఁ గాఁజేయ
కాపాడి యిచ్చిన భూపులెవరు

గీ. దేవతలమంచు మనతోడ దిరుగువారు
భూమదిరుగాడు మనుజులే పూర్వుబోఁడి
చక్కదనమున గుణమున బెక్కుగతుల
మనుజులేసుమ్ము సురలను మనుచువారు.

ప్రేయసీ! యొకమాట. ఆ యహల్యను నీ వొకమాటు చూడుము కోరఁదగినది కాదని నీకుఁ దోచిన నిక్కముగా పరిత్యక్తురాలె. పాషాణమానసను లావణ్యవతీలావణ్యామృతప్రభ సారమున నీరు నీరుగా స్రవించవలసిన దే. ఆ చిన్నది చిరకాలమునుండి నాకే దక్కునని నమ్ముకొంటిని ఇప్పటికి హతాశుడ నైతి. ఈ దేవేంద్రుని ప్రాణము నీ యధీనము.

శచి :—చక్కదన మున్నమాత్రమున నాపై ప్రాణముల మాఁటకట్టవలసినదియా? సృష్టిలో రూపభేదములు పెక్కువిధములు. ధర్మమక్కర లేదా? తా మనినయట్లు పాతివ్రత్యమన స్త్రీలదేగాని పురుషులు పాతివ్రత్యధర్మము పరిత్యజించవలసినదియా? పరనారి చక్కనిదని స్వభార్యఁగా నుపయోగింప నూహింపవచ్చునా? ఎంతపాపము! ఎంతటి యవాచ్యము! ప్రాణాపాయకరము!

సీ. మెరుపులు ముద్దారు తరుణులగా నెంచి
కౌఁగలింపఁగ మేను కాలిపోద?

తళుకులీను ధారగలిగిన యసితల్
మెఱుఁగు జుట్టుఁ బ్రాణాళి బ్రమింగ లేద?
కాంతిగల్గిన దీపకళికను ముద్దాడ,
మూతికాలిన ప్రాణఘాతరాద?
అవురుగాచిన నెయ్యియని దాహమార్పంగ
ద్రాఁగిన ప్రాణాలు తల్లడిలవ?

గీ. వెండిబంగారు కలదని వేశ్యతోడ,
బ్రమింగ గొంతునబడుగాని మేలుగలద
పరులకాంతలు చక్కని వారలంచు
గోరి భుజియింపఁ బ్రాణాలు గోలుపోరె.

స్వర్గాధికారివి. నీకు గావలసిన వేనవేలు సుందరులు లభింతురు. బ్రాహ్మణపత్నిగమన కుతూహలమేల? విడచిపుచ్చుము. కయ్యమైనను నావారలతో సరిసముగానుండును. పరమశాంతుఁడగు బ్రాహ్మణునితో నేల మెందుకు? ఇందు జయముగలిగిన మీకు కీర్తిరాదు. అపజయము మిగుల దుష్కీర్తి వాసంగు. నా మనవి నంగీకరించి యీ దుర్వ్యసనము మానివేయుము. వెనుకముందు యోజగావించుము. మనగౌరవము పరిశీలించుకొనుడు.

ఇంద్రుడు :—ప్రేయసీ! నీ బుద్ధినంతయు నుపయోగించి యుపన్యాసమొనరించితివి. వినుటకు మనసున కిష్టము లేకపోయినను కార్యార్థినిగాన వినియున్నాను. ఈ యుపన్యాసములో సారాంశము లేదు. శిష్టపేషణము, తుషాఖండనము, పురుషులకుఁగూడ పౌర్వాపర్యవిచారము, వ్యవహారనైపుణ్యము, భావిశుభాశుభవిచక్షణయు కలదని యోచించుకొనుము.

శచి :—నాథా! కలదు. స్త్రీలకంటె వేయిరెట్లుకలదు. వ్యసనాసక్తమయిన చిత్తంబునకు యుక్తాయుక్తవిచారణ సామర్థ్యముండ

ఇంద్రుడు :—కేవల దర్శనముచేతనేకాదు. సేవచేతను, మదాజ్ఞా కరణముచేతను ధన్యురాలవు కాఁగలవు.

శచి :—తపస్వీ నీ సేవాఫలము, భర్తృనిదేశనివర్తనాసౌభాగ్యము, నా యశుభఫలములఁ దప్పక తొలఁగింపఁగలవు.

ఇంద్రుడు :—చేయవలసిన కృత్యములు క్రమక్రమముగ నివేదింపగలము.

శచి :—చిత్తము. (అని నిష్క్రమించును.)

ఇంద్రుడు :—నిక్కముగా దేవేంద్రుఁ డితిక ర్తవ్యతామూఢుఁడయినాఁడు. అహల్యామనోగతాభిప్రాయము దేవనేతను తప్పుడుమార్గములోనికి దించినది. ఇది యకార్యమని నెచ్చెలి నోరుపెట్టుకొని పలుమాఱు పులోమజ వచించినది యదార్థము. ఇప్పుడీవితర్కముతో నేమిప్రయోజనము? పురుషుడు పట్టినపట్టు సాధించితీరవలయును. శుభాశుభములు స్వాధీనములు. గౌతమాంగనను స్వాధీనము చేసికొనితీరవలయును. కార్యసాధనకు మూలకారణ ముపాయచతుష్టయముకదా? ప్రథమోపాయద్వయము ప్రకృత ముపయోగించిచూచెద స్త్రీలు వలచుటకు ప్రధానకారణములు కొన్నిగలవు. అన్నిటిలోను ప్రథమగణనీయము ద్రవ్యము, రెండవది చక్కదనము, మూడవది విద్య, నాల్గవది యధికారము, అయిదవది మాయాజాలము. మిగిలినవి వీనిలోని యంతర్భావములే. వీనిలో నేయొక్కటియున్నఁ గార్యసాధనమగునన, నా యందు సర్వము పరిపూర్ణముయియుండవచ్చు. త్రిదివసామ్రాజ్యముకంటె సిరులు మనుజలోకమున లేవుకదా? మనుజజన్మము దివ్యరూపముకంటె లొజ్జు గదా? యధికారాదు లనన్యదుర్లభములు. ఇంత సంపత్తిగల నాకే యహల్య స్వాధీనముగాకున్నఁ బరులు పరాంగనాసౌఖ్య మనుభవింపజాలరు. బ్రహ్మపుత్రికకమిత్రద్రవ్యదాన మొసంగుటచేతను మహదైశ్వర్యసంవర్శనముచేతను, మనోభ్రమ కలిగించెద.

సీ. చూచిచూడకనియట్లు సొమ్ముచేతనుపెట్ట
నలపుచెందని నాతి కలఁదె జగతి ?
అందగానినిఁజూ డెందంబు కలఁగుండు
పడి సొక్కకున్నట్టి పడతి కలదె ?
సంపదోన్నతీ భోగసౌఖ్యంబులకు నాశ
పడి చేరకుండెడు నలతిగలదె ?
విద్యాధికారమ్ము వెలయఁజూపినయంత
మరులొంది తిరుగని మగువకలదె ?
గీ. మారనిర్ముక్తకేతకి మార్గణాళి
నొడలు చిమ్ములువోనట్టి యువిద గలదె ?
తగిన బలమును శౌర్యమ్ము ధనము సొగసు
కలుగు దేవేంద్రు డింతకు గొలఁగవలెనె.

మగువలు నలపింపదగు సామర్థ్యము నాకుఁ గలిగిన స్త్రీకి లేదని, నిశ్చయము. సకలయువతీయువకుల మనోవిభ్రమదీపము ప్రకాశింపఁజేయు మదనుడు నా సేవకుడు. సకలకాముకజనచిత్తపరిభ్రమణ కారకమగు వసంతుడు మాకు భృత్యుఁడు. విరహిజనప్రాణమారణోపాయశాలి నిహారలోచి నా యనుంగు సేనాధిపతి. శుకశారికాపరభృతాదులు మాకు దాసానుదాసులుఁ సకలప్రాణిమనోచంచలనిచానుండగు మంధానిలుండు మాకు ప్రధానమంత్రి. ఇంతసామ్రాజ్యముగల నాకు స్వాధీనముగాని మనుష్యాంగన కలుగుట యసంభవము. కావున నిపుడే మాతలినిబంపి గౌతమమునిని యాగంబునకై రావించెద. సమయానుకూలముగ బాత్రలసమకూర్చి యహల్యా సంక్రందన నాటకము ప్రదర్శించెద. (ఒకపత్రి-వ్రాసి) సేవకా ! యీ లేఖంగొని మా సారధి కొసంగుము.

సేవకుడు :—(ప్రవేశించి తీసికొనును) చిత్తము. (అని నమస్కరించి వెళ్ళవలయును.)

శిష్యుడు :—అయ్యా! గురువుగారు! తమరు చూపించినదంతయు చూచినాను. వర్ష్మలు మోదుగపుల్లలు, వంతకాపాలు దొరుకునట్టి చోటులు కనుపట్టుట లేదు. కిసువులాగున్నది.

గౌత :—ఆ భాగ్యము మన భూలోకములోనె నాయనా!

అహ :—ఎవరో స్త్రీ పురుషులు గుంపులుగాఁ బళ్లెరంబుల నారార్తికలం గొనివచ్చుచున్నారు.

గౌత:—వెల్లగొడుగుక్రింద నడచివచ్చు దంపతులు శచీమహేంద్రులు. మనల నెదుర్కొని పూజింపవచ్చుచున్నారు.

అహ :—(స్వగతము) దేవేంద్రవైభవము మనోహరముగా నున్నది. (ప్రకటముగా) మన మీ సరోవరముచెంత పాదప్రక్షాళన మాచరించుకొని మార్గాయాస మపనయింతము.

(అని నిష్క్రమించుచున్నారు.)



## నాల్గవరంగము.

శచి :—తమ కీవిషయ మింతగట్టిగాఁ బట్టుపట్టుట న్యాయమా? కామము న్యాయాన్యాయ విచారణనుండి తొలఁగించినదియా? పరస్త్రీ సంగమమే పాపకని. ఇందును బ్రాహ్మణవనిత. అంతియెగాదు, బ్రహ్మపుత్రి. మఱియు మునిపత్ని. ఇందులో పరికాల కన్నుగలవాని ద్వితీయ అధ్వర్యుడన గుణసమానుడు. కావున గురుపత్ని తల్లియనవచ్చు. లెక్కలేని యచ్చరమచ్చకంటులు మీకు భోగకాంతలై బరాబరులు సేయువారలు. నిత్యయౌవనవగు నేను సరే జారునకు భార్య సురూపి యయిన సరసురాలయిన, చతురయయిన, మూచూడ పనికిరాదు. కోయన కోట్లకొలఁది బోటులు మీ వాకిట కావలిగాయుచుండ, తమ కీవంచనాకార్యమునకు లోఁబడుట యపాయకరమని చెప్పవచ్చు. మున్ను వ్యభిచారమున వంచింపబడినవారికంటె తమ రధికులుగారు.

సీ. పార్వతీకాంతను బలవంతజెట్టిన
జాలంధరునిశక్తి సమయలేద
కన్యాకుమారిని కాంక్షించి మహిషుండు
క్షణములో రూపరి చావలేద
బృంద నాపేక్షించి శ్రీమహావిష్ణువు
నీచజన్మలనెత్త నోచలేద
రైభ్యుకోడలితోడ రమియించఁజూచిన
క్రిమింగెకృత్రియయవ క్రీతమునిని

గీ. నాదు చరితంబు నేఁజెప్పరాదుగాని
కొండచిలువఁగ నహుషుండు కూలలేద
యన్యభామలగోరిన అయ్యలెల్ల
పరిభవంపకుండగా బయటఁబడరు.

కుమార్గానుసరణము. కూడనిపని. ఇదె ప్రార్థన. అంగీకరింపవలయు. దాసురాలు. క్షమింపవలయు.

ఇంద్రుడు :—శ్రేయసి ! నీ కీయుపన్యాసశక్తి యున్నదని మొన్న డెఱుంగకుంటినే ! బోధకతాశక్తిగూడ ననిర్వచనీయము ఉపాధ్యాయి నీపదవికిఁ జక్కని యర్హతగలదు. కలియుగంబున వ్యభిచారవృత్తియే జీవనముగాఁగల జాతిసామాన్యులు బహిరంగోపన్యాసముల లోకంబున రాజకీయవ్యవహారంబునఁ బాల్గొని పండితుల పరిభవింతురట. అదియు గొంత యర్థవంతముగా నుండును. పెనిమిటిని శిష్యునిగానెంచి ధర్మ బోధల నొనరింప సాహసించుట మృగ్యములగును. నాదియే పొరబాటు మనుష్యులకన్న దేవతలెక్కువకాస ? చెప్పవలసిన యంశము పెండిభావముగాఁజేసి చెప్పితివా ? విశదీకరించవలసిన విషయముకలదా ? ఎంత స్త్రీస్వాతంత్రత ! ఎంతయధికారపదవి ! ఎంతవక్తృత్వము ! ఎంతనిర్భయము ! ఎంతచండశాసనము ! పరోపదేశసమయమున తమ సహాజ లోపమును పరిగణింపరుకదా ! ఆఁడతనమే యనుమానపుజన్మ.

సీ. ఆ కాంత చక్కనిదై యున్నదనినను
'ఆ' యంచుఁ బెదవుల నట్టెవిరుచు
ఆ లేమ సొగసుల కాలయంబనినంత
మోము చిట్లించుక మూతిఁద్రిప్పు
ఆ రామకాచీర యందంబుగానున్న
దనినంత నేమేమో యనుచుసణుగు
ఆ భామ సిరిగలదౌనన్న మదిగుంది
కనులవెంబడి నీరు కార్చుచుండు

గీ. మగఁడు పరనారివీక్షింప మనసుచెదరి
నిలువు నీరయిపోవుచు గలతపడును
ఇతరవనితతో మాటాడనేమొ పుట్టి
మునిగినట్టుల లోలోన బొగలు నెపుడు.

భార్యాహృదయకేదారము నిస్సారమైనచో భర్తృమనోరథాంకురములు రూపుమాయవలసినదే. వ్యభిచారము దోసమని సచింపుచు వారెగాని యీ పనికిఁ జొరపడనివారు కానుపించలేదు.

సీ. దారుకావని స్త్రీలఁ దగిలి పర్వులుపెట్టు
శశిమౌళిగన వ్యభిచారికాఁడ
ఆడువేషము వేసి యీ శంకరునిగూడు
శార్ఙ్గిమాత్రము వ్యభిచారికాఁడ
కన్నకూతురిగూడ గామించి వెతఁజెందు
స్రష్ట జూడఁగ వ్యభిచారికాఁడ
అన్నభార్యనుగోరి యాయాసపడినట్టి
శచి జీవుడును వ్యభిచారికాఁడ

గీ. యెందరెందరో మానులే మేమొ పలికి
పరులకాంతల వలచిన వారులేర

చెప్పవచ్చును మాటలు చిన్నదాన
చేయుటొక్కటైన కలుగదు చెప్పువారు.

సఖీ! నే నేమనుచున్నానో నాకే తెలియకున్నది. భావభవుని భావములు దుర్భావ్యములుగా నున్నవి. ఆ జగత్తేజోరాశి, లావణ్యసీమ, అమృతంపువాక, దర్శనమైనది మొదలు,

సీ. హారాళివజ్ర ప్రహారాళిగాఁ దోచె
చిలుకలు పలుకగా చేదుతోచె
ధారాగృహంబులు కారాగృహాళియై
సంతోషమంతయు సమయఁజేసె
చంద్రమండలమెల్ల జ్వలనమండలమౌచుఁ
బరితాప మెక్కుడు పరఁగఁజేసె
వెలిదమ్మి పుప్పొడి వేడిదుమ్ముగ రేగి
మొడలెల్ల బొబ్బలు పడఁగజేసె

గీ. మంచిగంధము బూయఁగా మంటలొదవె
పుష్పమాలిక ప్రాణమై పొడుచుచుండె
చెప్ప లాలను వినవివా చేతమేను
కలవె జెందు పులోమజా కనుము యిపుడు.

ఆ మహాపురుష కౌషధ మొసంగుటకు బదులు విషప్రాయములగు వాగ్బాణములు నీ పురుషుని కొసంగ దలఁచితివా? నా మాట వినియెదవా లేదా?

శచి:— తారా! పురుషస్వాతంత్ర్య మెంత నిరంకుశముగ ప్రవర్తిల్లుచున్నది! రాజసగుణ మెంత స్వేచ్ఛగా సంచరించుచున్నది. కామునివ్యాపార మెంత నిర్గోలముగానున్నది. నాథా! యిది తగునా, తగదా యని యోజసేయక స్వసౌఖ్యానర్థదాయకమగు కార్యములందుగూడఁ దమపట్టునువీడక, మీకుగల స్వాతంత్ర్యాధికారము దుర్బలులమగు

మామీఁదఁ బరిపూర్ణముగా నడుపింపఁజేయుట సహజధర్మమా? సాధ్వికి భర్తృసేవకన్న సేయఁదగు కర్తవ్యము మరియొకటిగలదా? ఆ కార్యమునందు నియోగింతురా? లోకమంతయు భార్యల వంచించుటకై పురుషజాతి యసిధారావ్రతమూనినట్లు దయాళులే, మీరుగూడ నా కఠినవ్రతమే బూనవలయునా? నవనీతమృదులములగు యబలామనంబులఁ గఱగింపఁ గార్చిచ్చు నుపయోగింతురా? స్త్రీజనంబులపై నింత నిర్దయా?

సీ. ఇంట నుంపుడుకత్తె నిరీక్షించి దానికి
 పాదాల నొత్తించఁ బట్టుపట్టు
పడుపుకత్తెను దెచ్చి పడకటింటికిఁ బంపఁ
 బంతాన భార్యను బట్టిదంచు
పరకాంతతోఁగూడి పాన్పుపై బవళించి
 పెండ్లాము నెందుకో పిలిచి తిట్టు
తన సానికిట్టిన ఘాటోటుగుడ్డలు
 తనయాలి నుతుకఁగాఁ దన్నుచుండు

గీ. కన్నతల్లిని కులటకు కబురుసెప్ప
తిరుగఁ బంపుచు మాటికి ధిక్కరించు
పరువుమర్యాద నట్టింటఁ బాతిపెట్టు
యాడినదియాట దా పాడునదియు పాట.

నేస్తు లీరీతిగా గృహిణులఁ బెట్టుతిప్పలు చెప్పుటకు గ్రంథములుచాలవు కొందఱు బాజుగుగాండ్రు తమయమాయకపు టిల్లాండ్రపై పురుషులకుగల స్వాతంత్ర్యమంతయుఁ జూపింప నొరడాలతో చావఁగొట్టుదురు తమకు వీధులంగల మర్యాద గణింపక పెండ్లాలపై నొంటికాలిమీఁద జరుగిడుదురు. ఇది పరమార్థముగా బరిగణించుట న్యాయమా నాథా?

ఇంద్రుడు :—అబ్బా ! ఆఁడుదాని నడవడి నుడువఁదలపెట్టిన పదివేల భారతములు చాలవు.

సీ. మందుమాకులుపెట్టి మగనిఁ బుట్టనువేయ
  దలపోయు నెప్పుడు తలిరుబోడి
మోహాబ్ధిలోముంచి పురుషుని సుడిబెట్టి
  కలతఁబెట్టఁగనెంచు కులుకులాడి
ఆ మాట యీమాటనాడి నాథునిబుద్ధి
  చెడఁగొట్టనెంచును చెడిపెలాడి
ఆ వస్తు వీవస్తు వడిగి భర్తనుమారి
  రోసిపించును సదా యెమ్మెలాడి
గీ. పిల్లిమీఁదను కోడిపై పెట్టి తిట్లు
పలుకరించిన దయ్యంబు పట్టినట్లు
కసరికొట్టుచు 'నీ కొంప కాలిపోను
నాకు చావైనరా' దంచు నాతి మూల్గు.

మఱియును వ్యాకరణశాస్త్రమున స్త్రీలింగములోఁ జేరిన వస్తువంతో మాఱ్పాసిన జాలు భర్త పల్లకిపెట్టి పెద్దరట్టుసేయును. చిలుకపలికిన బెదరునట్లు కనపడి యర్ధరాత్రంబునఁ బచ్చిబాసలపై నిద్దరియద్దరిమూసిన పెద్దయేర్లు నిర్భయముగా దాఁటును. తాము వలచిన మగవాని మీఁద సిగ్గువాలిన గోట్టుకచత్తురు. తమ లోపము కప్పుకొనుటకు బూంకుల కోటలు కట్టుదురు. పెనిమిటి లోపములు చేటలతో తూర్పార పట్టుదురు. గనుసు పెండ్లాలను నిట్టివారు, మఱియు గొందరు పతివ్రతల మనిపించుకొనవలయునని,

సీ. వేఁకువజామున వెపలియేఁటికిఁబోయి
  స్నానాలు జపములు సలుపువారు
పాచినోటను చద్ది పట్టెడంతయు మెక్కి
  యుపవాసదీక్షల నుంచువారు

భర్తనింటను బ్రాచిపనిసేయఁగా బెట్టి,
భామ్యశాంతకిత్రోవ బట్టువారు
కామోత్సవముసల్ప గడగి లోలోపల
పౌరాణికునికాలు పట్టువారు
గీ. పరమవేదాంతభక్తిచే పరవశంబు
చెంది కులము గోత్రంబును చెరుచువారు
భక్తురాండ్రంచు దేశాల బట్టువారు
ఆఁడువారలకెదిసేయ నీకుఁ కాదు.

ఇట్టి మాయాస్వభావముకలవారగుటచేతనే పెద్దలందరును స్త్రీలకు రాచకీయ వ్యవహారములయం దస్వతంత్రతయు గృహకృత్య ధర్మకార్యముల యందు సహచరధర్మమును నియోగించిరి నీ ధర్మమయిన నీవు నిలుపుకొనియెదవా?

శచి :— నాథా! తమ కీయాగ్రహమునకుం గారణము నేను ధర్మమును నెరవేర్చలేదనియా? కామవికారమున మునిగియుండిన తమచిత్తము నా మాటలయందు విపరీతార్థకల్పనఁజేసి తమ కాగ్రహము జనింపఁజేసినది కాని, నేను తమునిదేశమును తిరస్కరించుటవలనఁ గాదు. తిరస్కరింపలేదు. మీ సేవకురా లొనరించు పుణ్యపాపముల ఫలములు కీర్త్యపకీర్తులు హితాహితంబు దేవరవారివి కాని నాయవి కావు. అధ్వర్యులొనరించు లోపములు యాగకర్తను బాధించినట్లు నా చేతలు తమ కీర్తికి భావిప్రతిబంధకమగునను భీతిచే నింత విన్నపమొనర్పవలసివచ్చినది కాని వేరుకాదు. మఱియు ననర్థఫలదాయకములయందు పాటీకఫలంబుల బూరంబుసేయనగునుగాని ద్రుతగతి నాచరింపనలదందురు. ప్రభువు నియమించినదానిని సేయుటయే సేవకురాలికి విధాయకమనుమాట మరువలేదు.

ఇంద్రు :— శుభమంటపంబునకు సహాల్యాసహితవై. సర్వాభరణభూషితులరై చిత్రనాటకప్రదర్శనార్థమని తీసికొనిరమ్ము. మా

వరమానముల ననుసరించి ఫలానుసరణమున నీవు మంటపమువిడిచి వెడలవలయు. సునందనుమాత్రము మరుగుగా నుంచుము. పొమ్ము.

శచి :—చిత్తము. (అని నిష్క్రమించును.)

ఇంద్రు :—నా యభీష్టము పరిపూర్తియయినది. నాచే జిక్కని యహల్య తప్పుకొనలేదు. మనసార నా కోర్కె దీర్చుకొనియెద. యప్స రోగణముల భూమికాప్రసాధన కాజ్ఞాపించెద. ఈ యోచనలం గాలమేల గడపవలయు? నా యభీసవాలంకారగౌరవమే యామెను నా స్వాధీన మొనర్చును. వేరు పరికరము లవసరములేదు. ఆ వాలకముఁజూడ నా మానసంబు కార్యసాధనను స్పష్టముగా జెప్పుచున్నది. వ్యవసాయ మున ధైర్యమువలంభించవలయునుగాని వ్యర్థసందేహములతోఁ గాలము పుచ్చఁగూడదు. శుభమండపమునఁ జిక్కినఁజాలును. కార్యసానుకూలము చేసికొనెదను. (అని నిష్క్రమించును.)

అయిదవ రంగము—సౌధప్రదేశము.

అహల్య :—ఈ దేవేంద్రుని నడువడి వ్యస్తముగా భక్తికవచాచ్ఛాదితమై కనుపట్టుచున్నది. చక్కని యోఁడుదానినిఁ జూచినప్పుడు మధ్యమలోకమున మనుజునకు సహజముగాఁగల్గు కామముకంటె దేవ లోకమున సహస్రానవృత్తి యధికముగాఁ గనుపట్టుచున్నది. ఈ జన్న మునఁ గూర్చుండిన దేవత లనిమిషులగుటచేఁగాబోలు అచలదృష్టుల గుచు సర్వదా నన్నే పరికించుచుండిరి. ఈ విషయమునగూడ దేవేంద్రుడు వారికి ప్రభువు. నన్ను మోసగించుటకీజన్నము ప్రారంభించఁ బడినదిగాఁబోలు. ఆ దేవేంద్రుడు నా కొనరించు కైతవోపచారములు శర్కరావిలిత విషఘుటికలనలె నర్థాంతరములై కనుపట్టుచున్నవి. ఈతని భక్తిరసము శృంగారరసముగా పరిణమింపుచున్నది.

సీ. మగమావికెపువాలు మసిన్నఁడు నీటను
గడుగుచు నడుగులఁ దుడుచునపుడు

చౌదంతియేలిక జాజిపూమాలిక
మెడలోన చేతుల నిడెడువేళ
వేలుపు జేజేఁడు వెలిదమ్మిమొగ్గలు
చరణాబ్జములపూజ సలుపు తరిని
గట్టుఱెక్కలగొట్టు జెట్టిదా సరిగంచు
పట్టుపుట్టముచేతఁ బట్టుగడియ
గీ. చిరుచెమటవోసె మైనిండ గరుపువారె
నొడలు వడకాడె జడిమంబు గడలుకొనియె
మాటతడబడె చెయ్వులు మారిపోయె
శిరము పాదాలచేర్పఁగా స్మృతియుఁదప్పె.

అప్పటికా ఇంద్రునిచేష్టలు ఉపహాస్యములుగానుండె. అర్ఘ్యార్హ్యనకొసంగ వలసిన వస్త్రమాల్యాదులకంటె, వేయిరెట్లు నా కధికముగా నొసంగుట చూడఁగా ద్రవ్యదానమున నన్ను లోఁబఱపఁజేయ నెంచునట్లున్నది. వానికిందోడు శచియు, మా యుద్యానమంటపమునఁ బవళింపుమని, మా శయ్యాగృహంబు చూపకపోయితిరిగదా, మా యేకాంతచిత్రపటముల గాంచలేదుగదాయని, యీ నాలుగుదినములు నా యుడుపులు ధరించి నా యలంకారములు ప్రసేయుచు యేమేమో నేర్పఁదలఁచినట్టుగా మాట్లాడుచున్నది. తాను కవియైనయు నర్థము దాఁకొల్పదుగదా! ఈ పూట శుభమంటపము చూపింప మా రాణిగారు దయచేయుచున్నారు. ప్రయాణమున కాయిత్తులు గావలెనని యంతఃపురదాసి సునంద వచ్చి యలంకరించిపోయినది. ఇదియంతయు భక్తిచేఁ జేయునగు, నా కన్యకాబుద్ధి యేలకలుగవలయు? ఎందుకు కలుగఁగూడదు? సహవాసము బుద్ధులను జెఱుపకమానవు. ఆ సత్పురుషసంగమము తప్పక యకార్యములోనికిం దించును. తుదకనర్థము చుట్టుకొనకమానదు ఈ పదిదినముల చనుమాసమునకే, యీ పర్ణశాలా నివాసము,

యీ చీరవస్త్రధారణము. యీ నిర్జనప్రదేశసంచారము మనంబున కేవగింతగానున్నది. నిజముగా సౌఖ్యమన మహేంద్రుని యిల్లాలిదే గాని మనుజభామినికి భోగమనుమాట యెక్కడిది? అందులో ముని పత్నులకు సౌఖ్యము, భోగము, యలంకారము, శశవిషాణములే. ప్రపంచమున నిట్టులకలవని స్వప్నమునగూడ చూడరుసరికదా, వినికూడ యుండరు. అందుది సౌఖ్యమనుభవించుటకు దగినది. సౌఖ్యమన స్త్రీ జాతిదే. అదే లేనిచో స్త్రీశబ్దవాచ్యమున కనర్హురాలు.

సునంద :—(ప్రవేశిం) అమ్మా! శచీమహారాణిగారు దయ చేయుచున్నారు.

అహల్య :—(లేచి) దయచేయుడు.

శచి :—(నమస్కరించి) అమ్మా! మీరు లేవనలయునా? ఈ చిరంజీవిని తమ పాదసేవకురాలుకాదా!

అహ :—తల్లీ! నీవు మహారాణివి.

శచి :—ఇదియంతయు మహాత్ముల పాదరజోమహిమ. నాను రీక్షణమున నీ పదవి ననుభవింపవగుదురు. (సునందతో) సునందా! నీ వావిమానముకడ నుండుము. పొమ్ము. (రహస్యముగా చెప్పి) వెం టనే తెలియజేయుము.

సునంద :—(నిష్క్రమించును)

శచి :—నిజముగా విచారించిన నీ మహేంద్రసామ్రాజ్యానుభ వయోగ్యమగు దివ్యరూపము, మంగళాకృతిమీదిగాని, యీ శచి పని కిమాలినదని నిశ్చయముగా చెప్పుచున్నది. క్షణకాల మా సింగపుగద్దె తా మలంకరించిన దేవతామండలము, దేవేంద్రుడు, నేను దాసులము. పరమానందమొందగలారము. లోకంబున స్త్రీజాతి కింతకన్నా హాయిమా. విలాసము, లావణ్యము, లక్ష్మీకటాక్షము, సృష్టి మొదలు నేటివరకు కలిగియున్నదా? కలుగబోవునా! అసంభవము, రూపమునగాని,

గాంభీర్యమునగాని నిజముగా నే శచి పాదసేవ కర్పూరాలుకాదు. తమ సహజసౌందర్యముద్రిక లరణ్యములపాలుగావించి బ్రహ్మ తన జడజ జన్మసార్థకము చేసికొన్నవాఁడు.

అహ :—ఇంద్రాణి! యీ దినమున నా నాథుఁడు స్వాశ్రమాభిముఖుడయినాఁడు. ఈ పూట ప్రయాణమట సాధ్యపడునా?

శచి :—బావగారుగూడ పది ఘడియలకాలము నవీననాటక ప్రదర్శనముగాంచి వెలువడుదురు. తమ రన్యథా యోజింపవలదు.

దేవేంద్రుడు— (చాటుగా సునందతో సంజ్ఞలుచేయును,) (లోపల పెద్దధ్వనియగును.)

శచి :—(సునందతో నిష్క్రమించును.)

అహ :—(అబ్బాయని మూలకు పరుగిడవలయును.)

దేవేంద్రు :—(వెనుకనుంచివెళ్ళి) భయపడవలదు. (అని నడుమున చెయ్యివేసి పట్టుకొనున ట్లభినయించును.)

అహ :—(విదిలించుకొని) అమ్మా! శచి! (అటు పరుగెత్తఁబోవును.)

దేవేంద్రు :—(అడ్డముగానుండి) మార్గములేదు. కవాటములు బంధితములు. దేవేంద్రు నానతిలేనిది వెలువడుటకు వీలులేదు.

అహ :—(బెదరుచు) అయ్యో యింక నాకు దిక్కెవ్వరు? నా గతియేమి?

దేవేంద్రు :—ఈ పరిచారకునికన్న వేరుదిక్కు కావలయునా? ఈ మహేంద్రసింహాసనమే నీకుగతి. ఈ యాభరణ మలంకరింతునా? (అలంకరించఁబోవును.)

అహ :—(దూరముగాఁబోయి కోపముతో) ఏమది?

దేవేంద్రు :—సమాగమ లాంఛనము. (వ్రేలికి నుంగరము పెట్టును.)

అహ :—(సిగ్గుతో) మహేంద్రా ! ఏమిపని ?

ఇంద్రుడు :—శుద్ధముగ్ధావతారముగా నటించుచుండిన నీ శచీకాంతుడు విముఖుఁడుకాఁడు.

అహ :—(భయముతో) మా విడదికి మార్గమొసఁగుడు. (కోపముతో) సరియాఁడుదానికి నెంతటిపరాభవముసేయ నుంకించినది.

ఇంద్రుడు :—భర్త్రాజ్ఞ నెరవేర్చినది. ఆకినుక నాపై జూపవలయును. నిగ్రహానుగ్రహములకు పాత్రుఁడగు నీ ప్రియుడిట సంసిద్ధుఁడుగానుండ సాపత్నిపై యలుక వహింపనేల ?

అహ :—ఓయి ! గోరూపవ్యాఘ్రమా ? పతివ్రతల నిట్లు పాప కార్యములకై బాధింపనగునా ? దేవతానేతవు నీవే కార్య మితరు లొనరించిన, నీయని దండింపవలసినవాఁడవు. యుదారబుద్ధిగలవాఁడవు ఇది విషమకోరిక. నీవు దేవజాతివాఁడవు నేనా మనుజకాంతను. నీవు చతురుడవు నేను ఛాందసురాలను, నీ వైహికసుఖాభిలాషివి. నేనా ముష్మికసుఖాపేక్షకురాలను, నీవు లావణ్యశరీరివి, నేను కర్కశదేహను నీవు మహాభోగివి నే నకించనురాలను. ఈ వ్యత్యస్త సంయోగము సౌఖ్యదాయకాదు, శ్రేయస్కరము కాదు. ఏకాంతాగమనమే విచారకరము, హానికరము. తమకు తెలియని నీతి నేను బోధించుదానను కాను జ్ఞాపకముచేయుచున్నాను సావధానుఁడవుకమ్ము.

సీ. పెద్దలు గనుఁగొన్న బుద్ధిలేదని యెంచి
గౌరవించని మహాకార్యవితతి
పరివారము గనుఁగొన్న పరిహాస మొనరించి
పనికిరాదనియు చివాట్లుపెట్టు
సేవకానీకచూచి చిలిపివాఁడని యెంచి
సద్భృత్యభావంబు నెంచిచూచు
బంధువుల్వీక్షించి భ్రష్టుగాఁ దలపోసి
వెలిఁబెట్టనెంతురు వెఱపుమాని

గీ. బలము నశియించు, కీర్తికి భంగపాటు,
బుద్ధి చెడిపోవు, మర్యాద బుగ్గియగును,
మానహీనత వాటిల్లు మనసు చెడును
పాపకార్యము పరకాంత వలచు తలపు.

ఇంద్రుడు:—ఇందలి సారాంశము మాకు ప్రయోజనకారి కాక పోయినను, భవద్వచన రచనాచమత్కృతి వ్యంగ్యార్థవ్యాఖ్యాలంకారపద గుంభనార్థమై చిత్రసంకలితమై శ్రోత్రపేయమై, మనోహరమై, యానందామృతప్రాపియైనది. కాని, భవదుద్దేశ్యానుసారియగు ఫలము నాకొసంగలేదుసరిగదా మన్మనోగతరాగాంకురములకు కొండంతదోహద మొసగించి జ్వరతాపపీడితుడు సారసోదకస్నానంబున సుఖంబు గాంచనట్లు భవదుపన్యాసామృతప్రసంగసంపన్నసంబు వియోగతాప మధికంబుగాఁ జేయుచున్నది. శబ్దశాస్త్రంబునందెట్టి పరిశ్రమంబు నాకగ్రము కాలేదు. అందులో స్త్రీశబ్దంబు బిత్తరిగా నిర్వచించెదు. స్వర్గరాజ్యార్హసింహాసనమునకు యోగ్యురాలనగు నే వంటకాంతారమునందు పర్ణశాలల వానలకు గాలికి యెండకు ననయుచు, శుష్కవృక్షమువలె భోగశూన్యనై పశుసముదాయమునకు సమానముగా నుండుచుండ బహుబుభుక్షితో కాపురముసేయుచు కాలము వ్యర్థపుచ్చుచుంటిని. పురుషప్రయత్నంబు కార్యానుకూలము గాకమానదు. అభినవశిరీషకోమలమగు నీ శరీరము స్వభావవిరుద్ధమగు శుష్కోపవాసవ్రతతపోనిష్ఠలచేత పాషాణప్రాయముగాఁజేయుట కిచ్చగించుట స్త్రీలకుఁగల యబలాశబ్దబోధకమగు మనోదుర్బలత్వమును ప్రకటింపఁజేయుటకాని వేరుకాదు. నాది యితరులది యనునది మనోగతభేదముగాని ప్రపంచమంతయు స్వరంగాని పరంలేదు. నీ వీతని చెట్టపట్టకముందు గౌతముడు పరుడు కాడా, నీవు పరకాంతవుకావా? నా పతియని నీవు, నా భార్యయని యాతఁడు, మనోనిర్ధారణము గావించుకొంటిరి. స్వత్వమేర్పడినది. దైవ

యోగమున, నీవే నా చెట్టపట్టు గౌతమునకు పరకాంతవుకావా? ఈ విషయమునకు స్వతంత్రత మనసునకుగాని పరులకులేదు. జన్మక్రమముం జేరికి నేది లేదు. మనుష్యత్వము కల్పితము, మాయికము, ప్రతిబంధము, నిశ్చయముగాఁ జూచిన నీ యహంకార మమకారములు యీ పరువు మర్యాదలు, యీ పుణ్యపాపములు కల్పితములు. మనము వలచిన వాని కలయికవలనఁ గలుగు సుఖముకన్న లోకనిందలు పాపపుణ్యములు గొప్పవియా, బాధకములా? ఈ రహస్యము మనుష్యులకన్న సహస్రాంశములు దేవతలకు సుబోధకములు, నా యభిప్రాయము నీకు గోచరమయిన, నీ మనస్సునకునచ్చిన నా యుద్దేశము నెరవేర్చవలయు నా నిశ్చయమిది.

సీ. కనకంపుబొమ్మను గనుగొన్న కన్నోయి
మంటిబొమ్మను జూడ మనసుపడున
వీణారవంబుల వినెడు వీనులదోయి
ఘూకస్వనంబుల చే వినున
తేనెపాల్కుసుసార దనిచు గ్రోలెడు జిహ్వ
వేపనూనెను ద్రావ వేడ్కపడున
జాళువాభూషల సంతసించెడు మేను
యుక్కుభూషలఁ దోషమొందనగున

గీ. తమ్మి తేనెల గ్రోలెడు తుమ్మెదలకు,
గంధసింధురమదధార గాలిసోక
మనసు చెదరిన గ్రోలఁగా చనదతప్ప
తెలియజాలక నీ విట్లు పలికినావు.

యధార్థమిది, యోజసేయుము.

అహా :—ఎంతమూర్ఖుఁడవు! కాముకులకు వేదాంతశాస్త్ర ముపదేశించిన ఫలితార్థ మింతకు నెక్కుడగునా? ఇట్టి కుతర్కముల

నమసరించిన పశ్వాదులకును, మనకును భేదముండునా? ఏ పురుషుడయిన నీ ధర్మము నీ యింటియం దుపయోగింపవచ్చునా? ముప్పదిమూడుకోట్ల దేవతలకు రాజువు. కామధేను, కల్పతరు, చింతామణి మొదలయిన దివ్యవస్తువులకు నధికారివి. సకలధర్మవేత్తయగు బృహస్పతికి ముఖ్యశిష్యుడవు. యజ్ఞయాగాదులయందు హవిర్భాగములఁ గైకొన నగ్రగణ్యుడవు, బుద్ధిమంతుడవు ఇంత కుచ్ఛితవ్యాపారము కూడునా? ఆఁడుదాని నన్యాయముగా బలవంతముగాఁబట్టి పశుకృత్యమొనర్ప పలువురు ఛీ యని పరిహాసింపరా?? "లజ్జా మేకాం పరిత్యజ్య త్రిలోకవిజయీ భవేత్" అనఁగ సిగ్గునొక్కటి విడిచిన ముల్లోకములు జయింపవచ్చునట. అభిమానముండవలె, మర్యాద కాపాడుకొనవలె.

సీ. వజ్రాయుధము చేతఁబట్టి కొండలఁగొట్టి
ఖ్యాతిగాంచిన వాఁడవీవు
బలరక్కసుని ప్రాణములఁదీసి సత్కీర్తి
వడసిన బలుదంట వఁటవీవు
సర్వలోకోత్పత్తి సాగించు కశ్యప
బ్రహ్మపుత్రుఁడవౌచుఁ బరగినావు
బ్రహ్మాండములనెల్లఁ బాలించు వైకుంఠు
సోదరుండను పేరు సాదినావు

గీ. ఎంతయుండిన లాభ మావంత లేదు
స్త్రీని సాధ్విని చెరఁబెట్టి సిగ్గువిడిచి
యొంటిపైబడ గమకించు చుంటివౌర
కాలిపోయెన నీ బుద్ధి గౌరవంబు.

సామాన్య మనుష్యాంగనచేత, ఛీ యనిపించుకొని చావులేనివాడనై మన నెంచితివా? మా వంటి సాధ్వుల నేడిపించి పుత్రమిత్రకళత్రాదు

లతో మాడి మసిగాగలనను జ్ఞాన మణుమాత్రమయిన నుండవలదా? ఇట్టి నీచకృత్యము లొనర్చుచున్న నీ దేవేంద్రనామము కాల్చనా? విడిచిపుచ్చెదవా? నిన్నును నీ స్వర్గమును బూడిదపాలు గావించనా? ఆడుదాని యనుమతిలేక గవయఁజూచిన పసరమని పదిమంది బ్రువ్వ దిట్టుదురను వెఱపుమాని, మగవాడనని, యారుమాసములు సాము చేసి గడపక్రింద కప్పను బల్లెమునఁ బొడిచినట్లు, నీ వైభవము, పౌరుషము, తుట్టతుదకు సర్వరమని మాయఁబన్ని పిలుపించి, నీ భార్యయు నీవు నొక్కటియై, సాఁటెయాఁడుదానిని పరాభవించుట కాపులోమజకైన సిగ్గులేకపోయెనే? పశుకృత్యము లొనర్చుచుంటిరా? బ్రతుకదలచిన దూరముగా నుండుము. గట్టిగాఁ గన్నుదెరచిన నీ తల సహస్రశకలంబులు గాఁగలవు. నిర్గమనమార్గము చూపెంచెదవా? చూచుకొమ్మ నెదవా? దాక్షాయణీశక్తి విన్నిగ్రాంగారికణములవలె నీ యహల్యా పరాభవదావాగ్ని నిన్ను నశింపఁజేయకమానదు.

ఇంద్రుడు:—(బెదరుచు మారిమునకు బోవలయును)

అహ:—(ఆ వైపు చూచి) ఆ కవాటము తెరువఁబడినది. నిష్క్రమింతునుగాక! ఎంత యభాగ్యస్థితి కలిగినది.

(అని నిష్క్రమించును.)

ద్వితీయాంకము—సమాప్తము.



# అహల్య.

## తృతీయాంకము.

మొదటి రంగము—స్వర్గప్రాంతము సౌధము.

ఇంద్రుడు:—(స్వగతము) నే నెంత ప్రయత్నించినను, ద్రుహిణాత్మజ నా స్వాధీనమగునట్లు లేదు. అమితమగు ద్రవ్యదాన మొసంగినాను నాకుంగల సంపద్విశేషంబులఁ జూపించినాను. కామాతిశయములగు నుపాయంబులఁ బ్రయోగించినాను. మదనుని స్వయముగాఁ బంపినాను నా యత్నములన్నియు సముద్రంపు టుప్పును విరుచుటకు శర్కర నుపయోగించినట్లయినది. నా చక్కదనమునుగాంచియు, నధికారైశ్వర్యాదులుగాంచియు గనుగీటిన వేసవే లప్సరసాంగనలు వలచి వచ్చుచుండ మనుష్యాంగన, బ్రాహ్మణపత్ని, దరిద్రురాలు, నన్ను త్రిప్పలు పెట్టుచున్నది. ఓయి మారా! నీ శరంబులు మాపై పనిచేసినట్లు సాధ్వీమనోధైర్యపంజరమును భేదింపఁజాలకున్నవి, అవును పుష్పశరములు వజ్రభేదన సమర్థములు కావు. నీ వేమిచేయగలవు? కాలవిపరీతము నీ యజమానునిపై నీ బాణములు నిరాఘాటముగాఁ బ్రయోగింపఁగలవుగాని, పరాంగనపై బ్రయోగింపఁజాలవో!

సీ. నిను గాల్చివేసిన నీలకంఠుఁడు మాకు
గృహార్ధవపునుమాట యెఱుగవేమొ
నీ తొలిబాణమ్ము నెగడఁజేసినవాఁడు
మా యోధుఁడనుమాట మరచినావొ

నీ కొక్కె-మునుగొట్టి నీటఁగల్పినవాఁడు
నా సోదరుండను ధ్యాసలేదొ
నీ వింటిబద్దల నిర్మించి పోషించు
మొనగాఁడు నా బావ యనుటవినవొ

గీ. నన్ను సాధించ నీ సేన నాశమగుట
దెలియజాలవు నామీద తీక్ష్ణబాణ
పాతమొనరింప యత్నించ పాటిగాదు
మానుమికమీద మన్మథా మనవి వినుమ.

(తెలివితో) నే నింతదనుక నేమియుంటినో నాకు జ్ఞాపకములేదు. నా యుపాయములు నా కుపకరింపలేదు. న్యాయపద్ధతి కార్యము సాధించు టరిది. మాయమార్గమున సకలకార్యములు సాధింపవచ్చు. యుపాయాంతరము యోచించి నేఁటిదినమున గౌతమాంగనను వశముచేసి కొనియెద. (అని రెండడుగులు నడువగా)

శచి :—(తొందరగా ప్రవేశించి) వద్దు వద్దు (అని మార్గమున కడ్డముగానుండి) ఈ యకార్యమున కింతసాహసమా? పాపకార్యము ఫలించునా? ఫలించిన ప్రయోజనముఁకలదా? అపాయమువచ్చును.

ఇంద్రుడు :—(క్రోధముతో) నిన్నెవరు రమ్మని పిలిచిరి?

శచి :—మీ యకార్యప్రయత్నము, నా విధివిధానము నన్ను పిలిచినవి.

ఇంద్రుడు :— మా ప్రయత్న మింతటితో విరమింపమని నీకు చెప్పియుంటిమికదా?

శచి :—చెప్పియుంటిరి.

ఇంద్రుడు :—ఈ పిష్టపేషణ మెందుకు?

శచి :—సేవకులకు విన్నవించుటయేగదా ముఖ్యకర్తవ్యము?

ఇంద్రుడు :— అధికారమున్నంతవరకు.

శచి :—కాదు ప్రాణమున్నంతవరకు.

ఇంద్రు :—అధికారమునుమించిన ప్రాణములు నివసించుటకు స్థలమెక్కడ ?

శచి :—దేవరవారి పాదములు.

ఇంద్రు :—మూర్ఖప్రసంగములుమాని యావలకుఁబొమ్ము.

శచి :—మాయోపాయము లొనరించుట ధర్మభంగము, విపత్కూప పతనము.

ఇంద్రు :—మాకదియె మొదటినుండి విజయమునే కూర్చినది వినుము.

సీ. మాతృష్వసేయుల మర్దించ కడుపులో
మాయచే విజయంబు మాకు కలిగె
పౌరోహితుని మేము వజ్రధారను ద్రుంప
కపటవృత్తి జయంబు కలిగె మాకు
మాయావిప్రునిగాద మా వామనుఁడు బలి
చక్రవర్తిని ద్రొక్కి సాగనంపె
ఛలవృత్తిచేగాద శంకరానందంబు
చెడఁగొట్టి తారకుఁ జెరచినాము

గీ. మాయ నుపయోగ మొనరించి చేయలేద
నహుషు నానాఁడు చిలువగా నాతినీవు
కార్యసాధన సలుపఁగా కపటమనుచు
నూరకుందురె సాధించి తీరలేరె.

అనవసరముగాఁ బ్రసంగింపక లోనికిఁబొమ్ము. అడ్డుచెప్పకుము.

శచి :—నా ప్రార్థన సంగీకరింపుడు. ఇప్పుడు మానివేయుడు, ఇంకొకమారు యత్నింపుడు ఇది సమయముకాదు.

ఇంద్రు :—(తిరస్కారముగా) అగౌరవమందెదవు.

శచి :—తమరు నా కొనరించినది యగౌరవమే కాదు. మీ చిత్తమువచ్చినట్లు చేయుడు. ఈ ప్రయత్న ముడుగుడు.

ఇంద్రుడు :—(అసహ్యాముతో) అడ్డు లేచెదవా? లేవవా? నా విధికి నీవు కర్తవా? బ్రహ్మవా? ఆచార్యుడవా?

శచి :—నేను చెప్పిన వినరాదా?

ఇంద్రుడు :—వినరాదు.

శచి :—(బ్రతిమాలుచు పాదములు పట్టుకొని) దయయుంచి మీ కపకారమగును, కూడదని ప్రయాణము కాకూడదు.

ఇంద్రుడు :—ఈ శకునములు మా కక్కరకురావు. (విడిలించుకొని పోవును.

(తెర జారును.)

## రెండవ రంగము—ఉద్యానవనము.

అహల్య :—(ప్రవేశించి యచ్చెరువుతో కృచ్ఛ్రోపవాసవ్రతాదులచే గృశీభూతేంద్రియులగు నా వంటివారికిగూడ నీ వసంతోద్గమంబు మనోవికారము గల్పించుచుండెనే! నా చిన్నతనమునుండి యెన్ని మధుమాసములు చూచితిని. ఈ యకాలవాసంతికోత్సవము నతే మనోవిభ్రమము గలిగించిన దొక్కటైన లేదు చిత్రము. ఇది నిర్జీవ వృక్షముగదా! ఫూమూలాగ్రముగా జిగిర్చినదే. పలాశకుసుమంబులయందు పరిమళము విపరీతఫలోదయకారణము గావలయు. మోదుగపూవులయందు సువాసన? ఇది యేదో మాయగానున్నది. ఔరా! కాముకవ్యాపారము స్థావరతిర్యగాదులయందుగూడమితిమీరుచున్నది ఎన్నడైన నా మనంబు కామోద్రేకంబున నస్వాస్థ్యము పొందినదియా ఇప్పుడీభర్తృసందర్శనాభిలాష కేమికతంబో? యెటుచూచిన లతావేష్టనములు. చిత్రతరకైశ్యములు, విచిత్రపరిరంభణములు కామసూ

త్రకళాశాలవలె విస్తారీకృత విద్యార్థ్యానాక్షిపటలివలెఁ గనుపట్టు చున్నది.

సీ. కుసుమపాత్రంబునఁగూడి భార్యను తేఁటి
త్రావుచుండెను తేనె రాగమమర
సంస్పర్శ సుఖమున సంమీలితాక్షియా
లేడిఁ గొమ్మునఁగోకె లేడి ప్రేమ
అర్ధజగ్ధంబులౌ యరవిందనాళముల్
చక్రాంగన కొసంగె చక్రకనియు
పంకజరేణు సంవాసితంబగువారి
గౌరవించెను భార్యఁ గరివిభుండు

గీ. చివురు పెదవుల చక్కనై చిత్రపుష్ప
గుచ్ఛహారోజ్జ్వల స్తనములఁ గూడ నెంచి
వీరుధంబుల భుజశాఖ గౌరవించు
చుండె తరువులు ప్రేమచే జోద్యమమర.

స్థావరంబునకుఁగూడఁ మారవికారమా? ఈ చిత్రములన్నియు మనం బున సరిచూచుకొనిన మహేంద్రశుభసంటపోద్యాన సమీపంబునఁ గల్పించిన కృత్రిమవ్యాపారములవలెఁ గనుపడుచున్నవి. ఇది మహేంద్రమాయాజాలము గావలె. లేనిచో బరమశాంతనికేతనమగు గౌతమాశ్రమంబునఁ గామభటసంచార స్వేచ్ఛావిహార మెట్లుఁగలుగును? ఓయి దేవేంద్రా! నన్ను వెంటబడి వేధించుచుంటవే. (పులకాంకురము సూచించి) ఇంద్ర నామోచ్చారణము నాకు సాత్త్వికభావోదయమాయె నది. మోసము జరుగునేమో! దేవతావిధి కనుకూలించు పుష్పములు మాత్రము కోసికొని, యాశ్రమమున కేగవలయు.

(అని పరిక్రమించును)

ఇంద్రుఁ :—ఇదియే గౌతమాశ్రమోపాంత పుష్పవనము. వసంతుఁడు స్వయముగా వనం బలంకరించినాఁడు. (పరిక్రమించి తోటలోఁ ప్రవేశించి) ఏమి యరణ్యరమణీయము! నా మనంబును మోదఖేదంబుల ముంచుచున్నది. ఈ షట్పదఝాంకారము, యీ పరభృతాలాపము సహజముగా శ్రోత్రపేయమయినను ప్రకృతము దుస్తరమగు నసంభోగ విప్రలంభశృంగారవారధిలోఁ దిరుగుచున్న నాకు భీషణభాంకృతుల వలెఁ దోఁచి చిత్తక్షోభఁ జేయుచున్నవి. మంజులమగు నా లతాకుంజము సమీపించెద. (పరిక్రమించి చూచి విభ్రాంతితో) అహో! నా భాగధేయము! ఏ లావణ్యవతీలావణ్య సౌధాంతరమ్మున నిర్వికల్పసమాధిలో నేకాంతోపాసనము సల్పుతుంటినో, యే మదనసామ్రాజ్యమంగళదేవతాకృపాపాంగ వీక్షణప్రసారమ్మునకై నాకలోక విభూతినంతయు పాకశాసనుండు బలిప్రదాన మొసంగ సంసిద్ధుఁడై యుండెనో యట్టి పసిండిబొమ్మ, సకలప్రాణిమోహనదివ్యౌషధీ ఘుటిక, లావణ్యార్ణవలహరిక, పరిపూర్ణశారదవిహారకిరణకళాలేఖ, మదనశాంబరీమాయావిలాసదేవత, అస్మత్ప్రాక్తనసుకృత క్రియాకలాపసంజనితపుణ్యమంగళదేవత, సాక్షాత్కరించినది. ధన్యాత్ముఁగావించినది. ఆనందామృతిలహరికల నోలలాడించినది. మోహశృంఖలాబంధమోక్ష మొసంగినది. (స్తంభించి) మనంబు నిర్విషయమగుచున్నది. ప్రాణములకు నవస్థాంతరప్రాప్తియగుచున్నది. (విస్మయను సూచించి) ఏది, దాఁటిపోయినది. (పరికించి చూచి) యదృశ్యమాయినది. (ఆతురతో) నేత్రముల కంధకారము గ్రమ్ముచున్నది. (కనులు తుడుచుకొని) బ్రహ్మాండమ కనుపడుటలేదే! (సంతోషముతో) ఈ దేవేంద్రుఁడు నిశ్చయముగా ధన్యుఁడు.

సీ. స్త్రీవేషమునుదాల్చి శృంగారరస మిల
సంచారమునుసల్ప సాఁగెనేమొ

లావణ్యవారాశి లహరిక రూపంబు
సహించి భూమికి వచ్చెనేమొ
సౌందర్యఖనిజమౌ శౌక్తిక మణికల
దివ్యాకృతినిదాల్చి తిరిగెనేమొ
మన్మథశాంబరీ మాయావిలాసంబు
భామాకృతినిదాల్చి బరగెనేమొ

గీ. యనుచుఁ బురుషులు గుమిగూడి మనసులోన
బొగడి తలయూచి, యటుచూచి ముదముగాంచి
సంతసింతురొ దేనికై సతత మిలను
దానిగాంచితి నేధన్యతముఁడనైతి.

ఈ సుఖము మెరుపువలె క్షణికమైనది. (పరిక్రమించి) అదుగో నా వైపున క్రొక్కారుమెరుంగు, భూమిపై దిరుగాడుచున్నది. అబ్బురము ఇంతకుమున్ను చూచినరూపముగాదు. అభినవమనోహరాకృతి, అనుక్షణసంవర్థిత నవయౌవనమహామాయాజాల విద్యావిలాసము. ఏమి యపాంగవీక్షణప్రసారములు! లతాకుంజముపై తరణికిరణతారళ్యములై ప్రభారింఛోళిరూపితములై మెఱుంగులనీనుచు, పాకశాసన ధైర్యకవచవిధ్వంసమునకు దుపాకిరవ్వలవలె దేహాంతఃపాతములగుచున్నవి. ఓ పూవుటీరమా ! ఇప్పటికీదేవేంద్రునికన్న నీవే ధన్యురాలవు. మన్మనోహారిణీ వయదాపాంగప్రసారమునకే యీబిడౌజుఁడు తను మనోధనప్రాణము లర్పించినాఁడు, అర్పించుచున్నాఁడు, అర్పించఁగలఁడు. మనోరథము పూర్తిగాలేదు. అప్రయత్నముగా నీకు సాధ్యమైనది. మాటిమాటికి నీ నవనీతమృదులాంగి సాహచర్యము సంప్రాప్తించుటకు ప్రాక్తనపుణ్యమేమాత్రమో మీకీస్థావరజన్మంబున సన్నిహితమైనది. (పరికించి) అదుగో నా భాగ్యదేవత.

సీ. కొమ్మపై చెయ్యూతగాని చేతకై తాంబూ-
లనియాఱ్చుకొనుచుండె దరహసితమున్న

మునివేల పుష్పంపు పుటికఁ బ్రేలాడఁగా
ప్రమానున మెయిజేర్చి రమణిమిన్న
అభ్యన్న తాంగుష్ఠమౌ పాదరాగంబు
ప్రసరింపఁజేయుచుఁ బడఁతిమిన్న
ముఖచంద్రదీప్తులు భూమిపై తరిపి వె
న్నెలలను గాయించు నెలతమిన్న

గీ. వనమునంతయు బంగారు నరకుపోసి
పూఁతపూసిన చందాన పొలుపుఁజూప
మేనమెఱుగులు వెదజిమ్మ మెలఁతమిన్న
చూచుచున్నది తనమేని సొబగు బిగువు.

ఓ మహీరుహమా! పూర్వపుణ్యభాగ్యమేగదా సుఖదుఃఖపరిణామ కారణము. నీవు స్థావరమవైనను దేవేంద్రుండే దేవి నభ్యర్థించి వ్యర్థుఁడై యల్లాడి తల్లడిల్లుచున్నాఁడో, యా యమృతసాగరవీచిక స్వాయముగా గాఢాశ్లేషసౌఖ్యము నీకొసంగుచున్నది. (ఈర్ష్యతో) నన్ను నీశాఖాకరావలేపంబులఁ దిరస్కరించనక్కఱలేదు. కార్యాసక్తుఁడగు రాజు ధర్మాధర్మములను, యుపకారాపకారములను యోచింపఁడు, సమయము వచ్చిన ప్రజలగొంతులు కోయునని స్మరించుకొనుచుండును. దైవమా! నే నలచిన నారీరత్నము పందెమును గెలిచిన గౌతముఁడు యథేచ్ఛగా ననుభవించుటకే? ఈ వృషాకపి కృశించుచుండ, నా కనులయెదుట, నా నలపులబరిణె నా పాదము స్తకము స్పృశియింపుచుండ వృక్షరాజముఁజూచి యా ఖండలుం డోర్వజాలఁడు. వదలు వదలు. నీ కారణంబున సకలభూరుహజాలంబు భస్మీభూతంబుగాఁ జేయుచున్నాఁడు. నీవు చచ్చితివి. (అని యాయుధముతో నహల్యను సమీపించును.)

అహ:—(భయముతో) ఏమి యీ ప్రళయము. ఋషిపత్నీశ్రముఁకు స్వేచ్ఛావిహారభంగమా? ప్రమదావనంబులు పరపురుష ప్రవే

శాస్త్రములా? రాజులు జారచోర ప్రవర్తకులా? దుష్కార్యముల యందు నిర్భయవ్యాపారమా? పిశాచగ్రస్తునివలె పరాంగనలపైకి దుమికివచ్చుటయా? త్రిదశసామ్రాజ్యగర్వము శాపాయుధుమీదనా విజృంభించుట? ఒంటరిగానుండు లేజవరాండ్రను పిచ్చిపట్టినవానివలె కేకలువేయుచు (ఆయాసముతో) అబ్బా! యెంత కేక! ప్రాణమెగిరి పోయినది. రాక్షసకృత్యము. చిరంజీవి మీ యయ్యగారిని పిలుచుకొని రమ్ము. ఈ దేవేంద్రుని దుండగమణంచును. అహల్య తెకతేరగా జేయ వచ్చినట్లున్నది.

ఇంద్రుడు:—(ఆతురతతో) వద్దు వద్దు. ఓ భీరువా! పిశాచగ్రస్తుని వదలించి, శిక్షించుట కీప్రయోగించిన మంత్రములు చాలును. నీవు చక్కగా గ్రహించినావు. ఈ దేవేంద్రుడు కామమోహపిశాచావేశితుడయినాడు. నిజముగా నీ పిచ్చివానికి దగినభూతవైద్యురాల వయినను, రాజవైద్యురాలవయినను నీవే. తగినయౌషధములు నీ చెంత గలవు. నమ్మదగిన సమర్థురాలవు నీవుండ సన్న్యలిజనుని బాగుచేయఁజాలరు. "కాలబడినపాము గరుడునకు మాసదను లోకోక్తి నీ వెరుంగనిది కాదు. స్వభావభీరువులకు భయము, కోపము, పిలిచిన బిరువెట్టివచ్చును నీ వనినట్లు త్రిభువనసామ్రాజ్యధురంధరుండను కావలసినంత కామపరివారసమేతుండయు సేవకావృత్తి పరిచర్యసేయుటకు సన్నద్ధుండయు యుండ నీకు భయనిదానమా? సకలభేషజస్వరూపురాలవు నీవుండ నాకు పిశాచామయబాధయా?

సీ. పూబోడి నీముఖ పూర్ణచంద్రోదయం
బున మేనిదౌర్బల్య మణఁగిపోవు
మదిరాక్షి కన్గవ మకరధ్వజంబును
సేవింప దృఢశక్తి చేరలేదా

లీలావతీకైశ్య నీలకంఠేశ్వర
రసమాన దేహంబు ప్రథిమగనదొ
ముదిత నీ యౌవన మదనకామేశ్వరి
గ్రోలినకాయంబు మేలుగనదొ

గీ. దర్పకాంబకపాత విధ్వస్తదేహు
డమరనాయకు డాశించె యతివ యూష
ధములు రెండు, వానిని విను క్రమముగాను
ప్రేమవార్ధురి యద్వైత విమలసిద్ధి.

అహ:—(పరిహాసముగా) నీకుంగల భాషాపాండిత్యమంతయు నా కడనే ప్రకటించితివి. మంచిశిక్షయే పొందితివి, దీనికిం దగినఫల మీవర కెన్నఁడు పొందినట్లు కనుపడదు. ఈ విధాతాత్మజనలనఁ బొంద గలవు.

ఇంద్రు:—పొందనేమి? నీ దయయుండినం దప్పక పొందగలను. భాషాపాండిత్యమా! అదియు నీ యింటివిద్యయే. శారదా దర్శనమున మూగవాఁడు పండితుఁ డగుచుండ సత్పుత్రివగు నీ దర్శనమున నాకు పాండిత్యము బుట్ట యచ్చెరువు కాదు. ఒక పాండిత్యమేమిటి? ఈ జనునియం దేసుగుణము కనుపట్టినీ, అదియంతయు భవద్గుణప్రతిబింబమే. కావున నీవు యోచించదగిన విషయము మాత్ర మొక్కటి కలదు. నీ గుణములు ప్రతిఫలింపఁదగిన మహేంద్రునియందు నీచే నుపదేశింపఁబడబోవు వాత్స్యాయనాగమరహస్యసూత్రార్థ ప్రతిపాదక బోధామృతబీజములు చక్కఁగా నాటుకొనుటకుఁదగిన కేదారమని యజమానురాలు సేవకుని వ్యర్థముగా నిలుపఁగూడదు.

సీ. లేతతామరపాకుచేత స్వేదముఁ వాయు
వీవనా? యొక్కింత ప్రేమసూప
చివురుటాకులు దెచ్చి సెజ్జగాపరునా?
ప్రేయసీ యొక్కింత విశ్రమింప

పూవులు గొనివచ్చి పొలుపుగాఁ గూర్చనా?
పరికింప నొక్కింత పనితనంబు
కల్పభూజంబులఁ గలుగుఫలంబులు
దెప్పింపనా? శక్తి తేఁటపడఁగ
గీ. విమలగుణశీల పలుకులు వేయియేల
తావకారుణ చరణాబ్జ తలము నాదు
తొడల నిడుకొని యొత్తనా పడఁతి నడక
బడలిక లుడుప కడువడి జడిమ విడఁగ,

అనంతరము నీ యనుగ్రహము. ఈ కార్యములయందలి నైపుణ్యము ముందు పరికింపవచ్చుఁ

బేహాగ్—చతురశ్రమం.

వెలఁది నీ కటాక్షపంక్తులు – వెదజల్లుమా యిది చెల్లుసుమా
పలుకరాని దుర్భరినవేఁడా – భాగ్యనిలయమగు స్వర్గంబేడా
చెలియ మోటతాపసి నీకేఁడా – చెల్లరె సందియమా సనుగూడా ॥వె॥

అహల్య :—

భాగేశ్రీ—త్రితాల్.

చాల్ చాలు నీ యుపన్యాసము – సంతసించితిని కట్టిపెట్టు
బాలికయేలా నిష్కారణముగ – నిప్పగిదిఁ వృథా చెడఁదలంచెదవు
పరమధార్మికుఁడ విద్విన్యాయమా – పరస్త్రీలఁగోరుట శ్రేయమా?
పురుషోత్తమున కగ్రజుండవు – మూఁడుకోట్ల సురలకు ప్రభుఁడవు
నెరగునన్ దురితమునకున్ – ఘోరనితరులన్ వచింపగానేల ॥చా॥

ఇంద్రుడు :—నీ మాటకు నవ్వువచ్చితినని కోపపడకు. నీ సహజ సౌందర్యమునుఁజూచి మోహించునది దేవతాజాతి. నే నొక్కఁడనే కాదు. నిన్నువలచి లోలోపల కృశించని యమరుఁడు స్వర్గంబున లేనే లేడు. నే నొక్కరుండ సర్వస్వము సమర్పించి నీ చరణరాజీవములఁ

ప్రాణము లర్పింపఁబూనినాఁడ. నా సహపాఠి మఱియొక్కఁడుగలఁడు. అతఁడు లోకచక్షువగుటచే సర్వదా నిన్ను పరికించుభాగ్యము, కరంబుల స్పృశించు నదృష్టముగలిగి కొంతతృప్తివహించి పరాయత్తవృత్తికిఁగుందుచు నెట్టెటో కాలము గడుపుచున్నాఁడు. నీ సౌందర్యవారాసిలో మునిగి, నీ విలాసదుర్గమకాంతారంబునఁజిక్కి, నీ మనోహరానయవజాలంబునఁ దగులుపడి, నీమృదులమనోహరాంగప్రచారమాశించి యుపోషిస్సారి, తెప్ప లల్లార్చి, శ్రుతిపాఠలురోసి, సకలవ్యవహారములు మాని, నాలుక చప్పరించి, మోక్షంబులు కోరుకొని, తలలు పరికించి, దారాపుత్రాదుల తిరస్కరించి, మనోరథసాధంబులు కల్పించి, హృదయహర్మ్యంబుల నీ నిగ్రహములు స్థాపించి, పంచేంద్రియవ్యాపారంబులు మఱచి, నిన్నుపాసింపని యమర్త్యులు లేరని, మదనునిసాక్షిగా నీ పాదములుపట్టి ప్రమాణము చేసెద. కాముకులమాటలు ప్రమాణములుకావని నీ వంటి రసజ్ఞురాండ్రు తిరస్కరించినఁ దిరస్కరింతురుగాక! మహేంద్రుఁడు ఉచ్చరించునది యథార్థముకాకపోదు. ప్రాణిమాత్రుఁ డెవ్వఁడు ఇది కాదనఁజాలఁడు

సీ. నీ మోమునకు సాటి యొందు నెమకిన లేదంచు
జంద్రునిపై బాస సలుపవచ్చు
నీ కన్నగవ సాటి నీటు లేదని యొందు
తమ్మిమొగ్గల నోలఁ దన్నవచ్చు
నీ మోవిపసగుల్కు గోము లేదని యొందు
నమృతంబు చేగొని యూఁదవచ్చు
నీ కైశ్యమున కెన లోకాన లేదంచు
పాముపడగను చేపట్టవచ్చు
గీ. మత్తకాశిని నీ మధ్యమమునకు తుల
లేదు లేదని హరిముందు వాదులాడ

వచ్చునే నీమీఁద మోహంబు వలనఁగాదు
అత్యృతము బలుక నిక్క మహల్య వినుము.

ఇది నా యభిప్రాయమె కాదు. త్రిజగజ్జనాభిప్రాయము. వలపనునది యెఱుపు సొమ్ము వంటిదిగాదు. సహజముగాఁ గలుగువికారము. ప్రతిక్రియ లేకపోవునదికాదు. మంత్రములకు ఫలంబులు ప్రాలునా? ఫలోదయంబులగునా?

అహా :— నీ కీకవిత్వధార నిరాఘాటముగా ప్రవహించుచున్నది పాపభయ మావంతయు లేదే. కనులువిప్పి యీ గౌతమాంగనను పరికింపుము. తైలోద్వర్తనాది సంస్కారములులేక పర్ణశాలల శీతోష్ణాది బాధల నలయుకవహించి కర్కశంబు వహించు నీ శరీరము. తైలసంస్కారాదులులేక జడలు పెనువేసికొనుచున్న యీ వేణియు, జీర్ణములై కర్కశములగు నారపంచెలు, యీ యాకృతి, నీ మనంబు హరియించుటగూడ నా దురదృష్టమెగాఁబోలు మహేంద్రా! తిరుగ నీ ప్రయత్నమేల మొదలిడితివి? నా స్వభావ మా శుభమండపమున గ్రహియింపలేద? ఈ వికారమును నా మాటలు మఱపునకు వచ్చెనా? లేక నీ సహజదౌరాత్మ్యంబు విడజాలకపోతివా? వివాహమునకుఁ బూర్వమే నా యందనురాగముండినట్లు నీవు ప్రకటించినది సత్యమునను నా తిరస్కారమున నా యూహ మరల్చుకొనవలయును గాని బుద్ధిమంతుఁడవుగదా తిరుగ నీ దుర్వృత్తి తగునా? అనురాగము సహజాయాతముగాని కృత్రిమకల్పనాజనితముగాదు. మోహకురాండ్రు నీ జాలములోఁ జిక్కుదురుగాక యాత్మజ్ఞానముండిన స్త్రీ యకాల వసంతాగమాదులకు గాని మాయజాలకుండరు, ఓయి వెఱ్ఱిదేవేంద్రుడా! యీ పనికిమాలి కార్యమునకై యెంతశ్రమపడితివి! జరక్కాల కన్నుగల ఋషికుంజరునితోఁ విరోధముబూనుట, వేదవతీబలాత్కారమున రావణుఁడు శపింపఁబడినట్లు నా చేతనో నా భర్తచేతనో శపిం

పఁబడుదువు. మా మునికులంబునకు శాపకుండవగుట నింతశాంతము వహింపవలసె. వచ్చినత్రోవఁ బట్టుము.

ఇంద్రుడు :— ప్రేయసీ! నేనును నిత్యము జాణలగు స్త్రీల సహవాసము చేయువాఁడనుకాని పరమఛాందసపు ఋషినిగాను. దైవసంకల్పమెట్లగునో తెలుపజాలనుకాని నీవు బలికిన పలుకులలో నాయం దనురాగశూన్యమున్నట్లు బాహ్యముగాఁ గనుపించదు. కనుపించుటకు వీలు లేదు. నీ యాకృతి కానవావాసమున వికసితశోభల నెనుచున్నదనియా నీ యభిప్రాయము? అట్లనుట కవకాశము లేదు వినుము.

సీ. శైవాలమునఁ జుట్టు జలజంబు కాంతుల
  వెదఁజల్లుటలు మానివేయునొక్కొ
పంకాంకితంబైన పద్మారి బింబంబు
  వెన్నెల లుఱియుట విడునొక్కొ
కంటకంబులుతోడఁ గలిగిన కేతకీ
  కుసుమంబు తావులఁ గురియదొక్కొ
నీహారికాసంక్తి నిలిచి తామరమీఁద
  ముత్యంపు టాకృతి బూనదొక్కొ
గీ. సహజసౌందర్యముండిన జాలు మగువ
పరుసవేదిని సోకిన యినుమువట్టి
మేలు బంగారుమైనట్టి లీల శోభ
లమరఁ జేయును సౌందర్య మన్నిటికిని.

ఇది యుత్ప్రేక్షాలియోక్తులలో గణింపఁబడదు, మఱియొకమాట. స్త్రీలు సుకుమారులనుట లోకప్రసిద్ధము. కావున మనంబుగూడ మిగుల సుకుమారమని కాముకు లభిలషింతురు. లాభనష్టములు కర్మానుసరణమును. ఉక్తిప్రత్యుక్తులకు, కాలము లేదు. నీ వద్ద మఱుగుపెట్టుట లేదు దేవేంద్రుడు నిన్ను బలాత్కరింపనున్నాఁడు. ఏమందువు? (అని సమీపించుచున్నాఁడు. తెరజారును,)

తృతీయాంకము—సమాప్తము.

# అహల్య.

## చతుర్థాంకము.

ప్రథమ రంగము—స్వర్గలోకము సౌధము.

ఇంద్రుడు:—(స్వగతము) దైవము నా విషయము గట్టిపట్టు పట్టినాఁడు. అహల్య నా విషయమై పూర్తిగా విరక్తురాలుగా లేదు. అట్లయిన నేను బలాత్కరించినపుడే నన్ను శపించియుండును. లేదా భర్తకు దెలియఁజేసియుండును. తెలియఁజేసిన నాతఁడు శాంతమూర్తియగుట నా పాపము నన్నే కాల్చునని యుపేక్షించియుండఁడుగదా? అహల్యకనురాగము లేనిచో సునంద నా దాసియని తెలిసినపిమ్మటగూడ గౌరవించునా? మన యుద్యానవనమునందలి పుష్పమాలికలకై కబురు పంపియుండదు. అభిజాత్యమునకు పెనిమిటివలన దనకు గొప్పముప్పు వచ్చునని తెగించలేకయున్నది. స్త్రీల కీజడిమ సహజము. అశ్వమాకోహించువానికే పాతశంక. మహేంద్రుఁడు నూతనఋషి వేషధారిగా దలఁచినాఁడు.

సీ. స్వర్ణచేలంబులు వదలించి కాషాయ
వసనముల్ మొలఁగట్ట వలఁచినాఁడు
మలయజపంకంబు తొలఁగించి మెయినిండ
బూతిపూతను బూయఁ బూనినాఁడు
వరరత్నహారాళి సురగించి మెడనిండ
తులసిమాలలు వేయఁ దలఁచినాఁడు
వజ్రంబు శస్త్రంబుఁ బట్టుహస్తముచేతఁ
గుండికఁబట్టఁగాఁ గోరినాఁడు

గీ. ఛత్రచామర చిహ్నముల్ సడలఁజేసి
పరమఋషి చిహ్నములఁదాల్చి మరగినాఁడు
ఇంద్రపదవిని వదలి ఋషీంద్రపదవి
నిలువనున్నాఁడు, పాకారి నేర్పుమీర.

మదన విజయమంగళదేవతాకరగ్రహణసమయ మంగళాచరణ స్నానమాచరించి పెళ్ళికుమారవేషము ధరించెద. ఇప్పుడు నిశీథి దాటినది. ఇంక నొకజామునకుగాని గౌతముడు స్నానమునకుఁ జనడు. అంతకాలము నిరీక్షించుట కష్టముగానున్నది. మఱియు కాలకృత్యముల కహల్య నిద్రనుండి లేచును. (యోజించి) కోడికూయఁగనే గౌతముడు నదీతీరంబున కేగును. ఇప్పుడే భూలోకంబునకుంజని మాయాకృకవాకురూపంబుఁదాల్చి కాలజ్ఞానమువలెఁ గూసి ఋషియపుడే స్నానమునకంబంపి నిద్రామోహితయైన గౌతమాంగన నస్మదీయార్ధాంగలక్ష్మిగా జేసికొనియెద. (గగ్గురుపాటు సూచించి) తలచుకొనినమాత్రముననే మేన బులుక లెగయుచున్నవి. ఇది యశుభసూచకమా? కాదు. కాకేమి? అగును. కర్తవ్యాంశమునం దనవసరప్రసంగ మొదులకు? మంచిది. మాయవేషముతో నా కోరికఁ దీర్చుకొనిన నాకు సంతసము చేకూరును. అహల్యకు పాతివ్రత్యభంగము కానేరదు. ఈ రహస్యము బయలుపడుటకు మార్గములేదు. కాని నేను మహేంద్రుడనని యామె యెఱింగినతరి నాకుంగలుగు సంతోషమునకు మేరయుండునా? యథార్థము తెలిసినపిమ్మటనైన నా యభీష్టము నెరవేర్చకుండునా? ఎన్నటికైన నాకు నహల్య స్వయముగా నాశ్లేషసౌఖ్యమొసంగునా? ఈ యుపాయమున దేవేంద్రుఁడు మోహబంధవిముక్తుఁడు గావలయు. నా భార్య యీ ప్రయాణము పనికిరాదని యడ్డుపెట్టినది. ప్రశక్తవశమున మాయోపాయమున గార్యము సాధించవలయునంటిని. ఋషివేషపుమాట నోటరానేలేదు. మనోగతాభిప్రాయము కనిపెట్టియుం

డనా? వీలులేదు. నామాట యెట్లు తెలియును? నేను చేయునది చోరకృత్యము గాన నా యాత్మభయమే నన్ను పీడించుచున్నది. త్రోవనుబోవువారందరు తన్ను చూడవచ్చిరనియే తస్కరునియోచన. దుష్టకార్యప్రవర్తనులకు భయము వెన్నుదన్నియుండును.

సీ. చోరత్వమును జేయఁ జేరినమనుజుండు
చీమచిటుక్కన్న చెదరిపోవు
జారత్వమును జేయ సాఁగినమనుజుండు
తలుపు బర్వినగానె తల్లడిల్లు
మోసంబు జేయఁగా మొనసిన మనుజుండు
ముచ్చటాడిన దెల్లఁబోయిచూచు
కూటసాక్ష్యముఁ జెప్పఁ గోరినమనుజుండు
ప్రశ్న చేసిన తప్పి బాటఁబోవు
గీ. కపటకృత్యము జేయఁగా గడగువాఁడు
పరులఁజూచిన లోలోనఁ భయముపడక
తప్పదెట్టుల పాపంబు దాఁగదనుచు
పలుకు లోకము నిక్కమా పలుకు జగతి.

అది నా కనుభవమునవచ్చినది. (యోజించి) తెల్లవారబోవుచున్నది. గౌతమవేష మలంకరించుకొనియెద. (అని నిష్క్రమించును.)

శచి:—(ఆతురతతో ప్రవేశించి) నాథుఁ డర్ధరాత్రంబున లేచిపోయినాఁడు. ఇప్పుడే కనుఁగొనినాను. ఎంతలో నెంతదూరము పోయినారు? కాముకులుపడు పరితాపమునకు మేర లేదుగదా!

సీ. ఆహారమింతయు దాహంబుసుంతయు
పరిగణింపరుకదా వలపుచేత
మర్యాదయునుమాట మంచితనంబును
తలపోయ రయ్యారె వలపుచేత

అభిజాత్యముఁగాని ప్రాభవంబునుగాని
భావించలేరుగా వలపుచేత
పాండిత్యమైనను ప్రఖ్యాతినైనను
నిలుపఁజాలరుగదా వలపుచేత
గీ. వలపుగలిగినవారికిఁ దెలియదౌర
క్రిందుమీఁదును క్రిందయనుచు
పరులుచెప్పిన వినరెంత వారుగాని
యంధులగుదురు మోహాంధ మానవరింప.

సత్తిని నోరువెట్టుకొని, వలదనఁ వలవసి వెంటఁబడి మొత్తికొనినను మగ జాతియేమోగాని పరకాంతలపై వలపుగలిగి పశుప్రాయులగుదురు. భర్తననరాదుగాని యీ యహల్య యెప్పుడుపుట్టినదో నా మంగళసూత్రమునకు ముప్పుగప్పుచున్నది. నా నాథునిమనంబుఁ ద్రిప్పఁజాలక పోయితినే. మాయోపాయముచేత పతివ్రతను పరిభవించిన శ్రీమహావిష్ణు వుబృందాపతేరంభణమొనర్చి యీజరామరణుఁడు బలుజన్మ లెత్తవలసి వచ్చెను. నా భర్త కెట్టిచిక్కట్టులు రానున్నవోగదా! నీడవలె నీతని వెంట నంటియుండవలయు. నాథుఁ డేమార్గమున,బోయెనో? ఎట్లు కనుగొందును? (అని పరిక్రమించును.)

ఇంద్రుడు :—గౌతమవేషముతో ప్రవేశించవలయును.) రాజు తలఁచిన దెబ్బలకు కొదువా? మనము వేషమువేసిన నచ్చువలె నుండవలసినదే. నన్నుఁజూచి యెవ్వరు గుర్తిడజాలరు. నేను పూర్ణముగ మారిపోయినాను. (దేహము చూచుకొని) భూమికాప్రసాధన మెంతో రమ్యముగానున్నది. కంఠధ్వని మార్చుకొనుట మిగులఁగష్టముగా నున్నది. అల్పాక్షరములఁ బ్రయోగించి కొంతదనుక మూకీభావము వహించి కార్యము గడుపుకొనివచ్చెద. (అని రెండడుగులు నడువగా)

శచి :—(వెనుకనుంచివచ్చి పాదములు పట్టుకొని) చనవలదు. నాథా! యిది యేమి ముష్టివేషము? ఈ ప్రయాణ మెక్కడికి? ఈ యర్ధరాత్రి భూలోకప్రయాణమా?

ఇంద్రు :—(సిగ్గుపడి సిగ్గుతో నుండును.)

శచి :—పతివ్రతాపరాభవ మెంతకు చాలదు? ప్రభువులే, మీరలే యకృత్యమునకుఁ బాల్పడుదురు? ప్రజలకు నీతినేర్పవలసిన పెంద్లే దుర్నీతిగ సంచరించిన ప్రజలను శిక్షించువారెవరు? ఆవు చేను మేయ దూడ కంచ మేయునా? ఎంతయపకీర్తి దెచ్చుకొనుచున్నారు. మీరు స్వయముగాఁబోయి ప్రతిమాలినపుడు తమ కామె యొనర్చిన హితోపదేశమునకు నిరుత్తరులై గదా తిరిగివచ్చితిరి.

ఇంద్రు :—(కోపముతో) నా వెంట పిశాచమువలె బడితివే.

శచి :—పిశాచ సంచారకాలమునకు దాము బయలుదేరిన పిశాచము వెంబడించదా?

ఇంద్రు :—నోరుమూయుము. నా యెదుటనుంచి లేచిపొమ్ము మితిమీరి మాట్లాడకుము. ఇల్లువిడిచి మహారాణివి యొంటిగ రాఁగా డదని తెలియదా? పురుషుం డొనరించు గార్యములలో స్త్రీల కనవ సరప్రసక్తి కూడదని తెలియదా?

శచి :—తాము యింటికి దయచేయుఁడు మీ చిత్తమునచ్చి నట్లు నన్ను శిక్షించుడు. పతివ్రతాపరాభవము మానుఁడు. మీ ముఖ కాంతి పరిశీలించుకొనుడు. ఎంతభీభత్సముగానున్నదో. శరీరమంతయు స్వేదము వెల్లివిరియుచున్నదే. పాపకార్యము నిత్యము చేయువారికిఁ దగుగాని, మీవంటి బుద్ధిమంతులు క్రొత్తగా నిట్టియకృత్యములను లోఁబడగూడదు.

సీ. హత్య నిత్యముఁ జేయ నలవాటు లేకున్న
కరకు కత్తిని మేక నరుకగలమె

దాతృత్వమున నేర్పు దగిలిన ధన్యుండు
యాచకుఁ డేఁదు పొమ్మనఁగఁ గలఁడె
అస్మృతంబులాడుట లలవాటుపడనట్టి
పుణ్యుఁ డబద్ధాలు బొంకగలఁడె
శాంతిచిత్తమునందు సంతరించిన యోగి
విషయాభిలాషకై వేడ్కఁ గనునె

గీ. పాపమొనరింప ధైర్యంబు వలయుఁ జాల
మనకు దగదయ్య వినవయ్య మాట నెయ్య
ముంచుమయ్య నా ఖినుతిని యొప్పదయ్య
సతులఁ బరిభవించుట నీకు సాగదయ్య.

ఇది గోమా కాని నాకు భీతియగుచున్నది. ప్రార్థనమాలించి యింటికిం జనుడు.

ఇంద్రుడు :—(కాలితోఁ దన్ని) అభ్యంతరము చెప్పకు. అభ్యంతరమునకుం బొమ్ము.

శచి :—నాథా! తమరు తామసించిన మనవిఁ జేయఁజాలను గాని యిప్పుడు తమరు ధరించిన వేషమే తమ యశుభమును దెలుపుచున్నది. మహారాజు లీ మురికినారబట్టలు గట్టవలసిన గ్రహచారమేమి యొడలినిండ బూడిదయేమి? పిలువ బంటును లేక యొంటిగా నిశాసంచారమేమి? కాముకులు యోజసేయరుగాని పరస్త్రీయ నాశించుటకన్న పాపకార్యము నీచకృత్య మింకొకటి కలదా?

సీ. సేవకుల్వెనుముందు చిత్తము చిత్తమం
చనుచు మీ ముందుగాఁ జనర దేమి?
కైదండ యొసంగుచుఁ గనుచూపు గనిపెట్టి
ముందు నడిచెడి దిగ్భూపులేరి?
పాలవెల్లినిఁబుట్టి నైరులఁ గనుగొట్టి
తమరు వహించు చౌదంతియేది?

రాజవేషోచిత రమ్యంబులై యొప్పు
సరిగంచు సూక్ష్మ వస్త్రంబులేవి?
గీ॥ యేమియునులేక ఋషివోలె నిట్లుతిరుగు
వారలో గ్రహచారబలము పలుకవశమె
యన్యకాంతల వలచిన యయ్య నిట్లు
మారువేసము వేయక తీరదయ్య॥

పరకాంతాగమనము మర్యాదాభూరుహమూలలూనకీటకము. అన్యభామినీ సహవాసాభిలాష ప్రాణధనంజయదర్వీకరము. కులనారీ పరాభవోద్యోగము చిరకాలోపార్జితసత్కీర్తిరాజీవమత్తసింధురము. ఇతరసాధ్వీసుసంశ్లేషానురాగము, విజ్ఞానపర్వతశృంగవిపాటనసహస్రధార. మనజ్ఞాతులు దుష్టకార్యలంపటులగుటచేతనేకదా నిశాచరుని యపకీర్తి వడయుట, మీరును మీసోదరుడును గలిసి చంపుట. యొరు లేవియొనర్చిన మనకపకారమని యెంచి సహించలేకయుందుమో యట్టి కార్యమొరులకు మన మొనర్పకుండుటయే పరమధర్మము. ఈమె మనకు ధర్మముచెప్పనదియాయని యాగ్రహింపకుడు. ప్రయాణము మానుండు తెల్లవారనిండు.

ఇంద్ర—ఈ యుపన్యాసము పదిదినములు కంచుగంటవాయించునట్లు చెప్పగలవు. ఊరకొట్టనక్కరలేదు వాగుటయేనా! ఆడుదానిపాటి యోచన మగవానికుండదని గర్వము. పరకాంతను మగడు వలచినాడన గిలగిల కొట్టుకొనిచత్తురు. తమయధికారమును చూచుకొనరు. (కోపముతో) ఇంకగట్టిపెట్టు, వాగకు. చెంపపెట్లుపడ పేలును. బుద్ధి తక్కువమాట లాడకు. భర్తతో సహవాసము, కత్తిపైసామువంటిదని తలచుకొనుము. యథేచ్ఛానువ్యాహారములు నెడలనీయకుము. పిలువనిపేరంటమున కేలరావలయును? అనవసరప్రసంగమున నుపకరించునది లేదని తెలుసుకొనుము. చచ్చినట్లింటపడియుండి పాచిపనిసేయ మగు

వకు తెలివి యెక్కడనుండివచ్చును? కీచురాయికూసినట్లు వాగుచు పిశాచమువలె నాకంటబడితివే, పొమ్ము. (అని కాలితో దన్నిపోవును)

రెండవరంగము - గౌతముని శయ్యాగృహము.

నిశీథసమయము-గౌతముఁడు నిద్రించుచుండవలయును.

అహల్య—(పెనిమిటికిఁ బాదములొత్తుచు స్వగతము) నేఁడు నామనము పూర్తిగా చీకాకుపడినది. ప్రమదావనమున దేవేంద్రునిఁ దిరస్కరించి వచ్చినదిమొదలు గృహకృత్యములయందు మనంబు ప్రవర్తించుటలేదు. నిక్కముగా నాచిత్తము కామవికారములకు లోఁబడినది. తీక్ష్ణాగ్నియందు బంగారము కరిగినట్లు కామశరగాఢాగ్నికి నీరుకంటె పల్చనగా ద్రవించుచున్నది. నామాటయేమి! నాయాశ్రమ ప్రాంతమందలి స్థావరాదులుగూడ మీనకేతనప్రచారంబున మైమరచిపోయినవి. వేయేల! వ్రతనియమమునం గృశించిన నా నాథుఁడుగూడ నాతోడ సరసోక్తులు ప్రారంభించినాఁడు. ఇదియంతయు మహేంద్ర మాయాజాలమయినను సహించుట దుర్లభమగానున్నది. ఎంతనియమమున్నను విషయగ్రామమును జయించుట దుర్లభము. ఇంద్రియగ్రామము విద్వాంసునిగూడ నాకర్షించునని వ్యాసభట్టారకుడు వాక్రుచ్చినది యనుభవమునకు వచ్చినది. ఏబాధనయిన సహించి యిముడ్చుకొనవచ్చునుగాని, కామబాధను సహించి ధర్మమును గాపాడుకొనుట దుష్కరము. ఇది యరణ్యప్రాంతమయి పురుషాభావమగుట నాకు పరమోపకారమయినది. నియమవంతుఁడగు మహామునియే స్త్రీవ్యామ్నసౌఖ్యాభిలాషియైనాఁడు. నామనంబున వారాసిపొర్లినట్లు శుచిరసము వెల్లివిరియుచున్నది.

సీ॥ పండువెన్నెల మీఁద బడ చంద్రునిప్పులు
        పైనఁబోసినయట్లు భగ్గుమనును
గండుకోయిలకూయ గుండె ఝల్లనిపోయి
        మదికేమొ విభ్రాంతి గదురుకొనును

చిలుకపల్కినఁజాలు తలదిమ్ము ఘటియించి
క్షణమున మేను చీ కాకుగనును
భృంగీరవమ్ములు భీభత్సమొనరించి
స్వేదమ్ము మెయినిండ వెలుగుకొ[illegible]ను
గీ॥ మలయపవనము మెయిపోఁక కలతగదిరి
వేఁడిగాలువు రక్తంబు పీల్చినట్టు
శుష్కగాత్రినిఁ జేసె నీ చోద్యమేమొ
మారవీరపరాక్రమ మహిమగాక.

బంగారమువంటి నాబుద్ధి పాడుగానున్నది. మాతల్లి నాకొనర్చిన ధర్మోపన్యాసములు సుడిగాలి శుష్కతృణములవలె కామవికార వాతావరణంబున సుడిగొనిపోయినవి. ధర్మమో, యధర్మమో ప్రకృతి సౌఖ్యము పూర్తిగా ననుభవించినది ప్రాణములు నిలుచునట్లులేదు. సర్వాభీష్టములు నెరవేర్చు నాభర్త నాచెంతనుండ నా కీయోచన లెందుకు? నిద్రలేపి నాస్థితిని దెలువరింతు. (యోజించి) స్త్రీలకుసిగ్గు భూషణమేగాని యిట్టిసమయమున, శృంఖలములవలె నిర్బంధముగా మనోగతాభిప్రాయముల దెలువడనీయదు. చిరకాలస్నేహమున, సర్వ రహస్యములు గుర్తెఱింగిన పెనిమిటిచెంత సిగ్గుపడుట పనికిరాదు. కులటలు పరపురుషునికెంత నభిమానమునందలి శరీరస్వాధీనమొనర్తురట. దుర్లభము, నింద్యము. నింద్యమననేల ప్రకృతివికారం మెట్టినీచకార్యమునైనం జేయించు. ఇప్పుడు నిశీధిదాటినది. కాని, నాథుండు నిద్రించి గడియయైననుగాలేదు. ఏమనిలేపను? స్నానకాలమాయనని చెప్పెదను. (అని భర్తను సమీపించి నిద్రలేపవలయును.) గాఢనిద్రాపరవశుండై యున్నాడు. (తిరుగా నిద్రలేపవలయును.) ఎంతనిద్రపట్టినది! ఇదికూడ మాయకాదుగదా? ఒక్క మేలుకొలుపు పాడెదను. (అని ప్రారంభించును.) (గానముచేయును.)

గౌతము— (నిద్రలేచి) ఏమి! యర్ధరాత్రి మేలుకొలుపులు ప్రారంభించినావు! తెల్లవారినదియా! పరుండి క్షణమయినను కాలేదే! అప్పుడె తెల్లవారినదియా?

అహల్య—తాము విశ్రమించి చాలసేపయినది. బడలియుండుటచేతఁగాబోలు కాలము తెలియలేదు. పిండియారబోసిన ట్లావెన్నెల చూడుడు. శరత్కాలచంద్రికవలె ముచ్చటగానున్నది. కోకిలకేకలు వినుచున్నారా? వసంతకాలమునఁ జెలరేఁగినవి. దిక్కులు తెల్లవారుటయేమి? నా దేహ మెంత తెల్లవారినదో చూడుడు.

గౌతము—మంచిగంధము పూసికొనినఁ దెల్లవారదా? ఆకూయునది కోకిలఁగా వినబడుచున్నదా? కోడి కూయుచున్నది. తెల్లవారవచ్చినది. మంచిపనిచేసినావు. స్నానమున కేఁగవలయు. దంతకాష్ఠమును తీసికొనిరమ్ము.

అహల్య—(స్వగతము) శుక్రోదయము గాలేదు. కోడి కూసినది. నామనోరథము విఫలమయినది (ప్రకటముగా) నాథా! నక్షత్రములఁ జూడుడు.

గౌతము—చూచినట్లే. నీచిత్తవికారము నాకుఁ దెలుసును. అదుగో! కృకవాకు. వేకువయినదిఁ స్నానమునకేగవలయు. నదీతీరమున నే కాల్యకృత్యములు నెరవేర్చుకొనెదను. నాకమండలము తీసికొనిరమ్ము.

అహల్య—(సిగ్గుపడి) ఇప్పుడు, మీరు వంటరిగానుంచి పోయెదమన్న నేమోభయమగుచున్నది. నాకేమి చిత్తవికారము! ఏమో క్రొత్తమాటలు ప్రారంభించినారే! అర్థరాత్రి స్నానమున కేగుచున్నట్లెయున్నది.

గౌతము—నిక్కముగా నీమనంబు నీస్వాధీనములో లేదు.

సీ॥ కోడి కూయుచునుండఁ గోకిలకేకంచు
పలుకుచుంటివిగాద కలికిమిన్న

వేఁకువగానున్న వేళ రాత్రియటంచు
జెప్పుచుంటివిగా దె చెలువమిన్న
వెన్నెలగనుగొన్న పిండిబోసినరీతి
గనుపించెనంటి వో కలికిమిన్న
గంధంపుపూతతో గలిసిన నీమేను
తెలుపారెనంటి వో తెరవమిన్న

గీ॥ పలుకులన్నియు వ్యత్యస్త ఫణితినుండఁ
జిత్తమున కేమొ విభ్రాంతి హత్తెననుట,
తప్పు నామాట కోపమా తరుణివినుమ
కాలగుణమిది నీకేలఁ గాని కలఁత॥

అదుగో! కోడి తిరుగకూసినది. స్పష్టమయినదా?

అహల్య:— (లజ్జ నభినయించుచు) అవును. కాలగుణమే! కాక పోయిన బ్రత్యక్ష విషయమునకు వివాద మేలకలుగును? ఈ యకాల మాధవలక్ష్మి యేమి?

గౌత:—అకాలముకాదు. స్నానకాలమే. ఇది మాధవలక్ష్మి గాదు. మదనలక్ష్మి. సర్వము నీమనోభవవిభ్రాంతియే. తారుణ్యప్రభావము. (అని కమండలము తీసికొని నడుచుచున్నాడు.)

అహల్య:—తమరు పండితులు. ధ్వనివ్యంగ్యములు సహజముగాఁ గల్పింతురు.

(గౌతముఁడు నిష్క్రమించును.)

---

## తృ తీ య ర ం గ ము.

ఇంద్రుడు:—(గౌతమమునివేషముతో ప్రవేశించుచున్నాఁడు) ఇప్పటికి నాయుపాయమును సాంతముగా ఫలించినది. గౌతముని యేటికిఁ బంపినాను. మదనునికి మొన్న నాచే నొనర్పబడిన బహుమానమునకుఁ దగినయుపకారమునకుగా నహల్యను పూ గి గా బాధించుచు

ఇంద్రు:—(స్వగతము) నాపేరుకూడఁ దెలిసికొనియుండునా? ఘుణాక్షరన్యాయమా?

అహ:—మనమున కేమియో భీతియగుచున్నది. విద్యార్థులను లేపుదునా?

ఇంద్రు:—(స్వగతము) ఇదే బయటఁబడుటకు మంచిసమయము (ప్రకటముగా) నే నుండగ బరులనేలఁగోరెదవు?

అహ:—(తుర్లిపడి సంతోషముతో) నాథా! స్నానముచేయ కుండగనే తిరిగివచ్చితిరా! ఏమి వేళకాలేదా? చలిగానున్నదా? (అని లేచి చేతిలోని కమండలము తీసికొని) ఈ శేలుఁ గట్టుకొనుఁడు. (అని శేలువనివ్వఁబోగా)

ఇంద్రు:—(సంతోషముతో) ఎన్నిదినములకు నా మనోరథము నెరవేరినది! అక్కరలేదు. నీగాఢాశ్లేషము నాకు సహస్రశాంకనములు (అని పొంగారుటు నభినయించుచు) నోరుజారినదే! యోచలు తెలియక నుడివినాను.

అహ:—మనోహరా! క్రొత్తవానివలె నటించుచున్నారే! మీ కెన్నిదినములనుండియో నా వలఁ దీరని మనోరథమొకటియా.

ఇంద్రు:—(స్వగతము) నా రహస్యమంతయు వెలువడినది. ధైర్యమువహించెద. (ప్రకటముగా) నీవు నాకొక క్రొత్తదానివలెఁ గనుపడుచున్నావు. నీ మనోగతాభిప్రాయమెఱిగి నీ కోర్కెదీర్చుపోన వచ్చినాను. ప్రేయసీ! విలాసము లెప్పటికప్పటికి క్రొత్తయికావా? వేకువ సమీపించుచున్నది.

అహ:—మీరు సరసులు, చతురులు నన్ను వ్యంగ్యముగా పరిహాసించుచున్నారు. నాకుగూడ నీ సమాగమము నూతనముగాఁ గనుపట్టుచున్నది. నన్నెపుడైన నిట్లు హాస్యమాడియుంటిరా? (దేహము పట్టిచూచి) మనోహరా! యీ దేహమం దీకంపమేల! ముఖవికారము క్షణక్షణము మారుచున్నది కారణమేమి?

ఇంద్రు:—(స్వగతము) ప్రతివాక్యము నా మాయావేషము నుద్ఘాటించుచునే యున్నది. ఇది నామనోదౌర్బల్యమా, భాషాచమత్కారమా? (ప్రకటముగా) ఆఁ! యేమియు లేదు నీవనినట్లు శీతబాధ మారవికారప్రభావము.

అహల్య:—(లజ్జ నభినయించి) పురుషులు గంభీరస్వభావులు-ప్రకృతిగుణ మందరికి సమానమే.

ఇంద్రు:—అవునుకాని, నీవుమాత్రము ప్రకృతము నవీనావతారము దాల్చనున్నావు.

అహల్య:—దాల్చినాననరాదా?

ఇంద్రు:—మహేంద్రుడని యంటివే. నీచిత్తము మహేంద్రాధీనమయినదా?

అహల్య:—దొంగా! నీవెంతసేపటినుండి చాటుగానున్నావు? మోసముజరిగిన చెప్పలేనుగాని, పాడుదేవేంద్రుడు వానినిఁ గన్నెత్తి చూచెదనా? నామనం బన్యథా వృత్తియగుటచే మహేంద్రుని గృహకృత్యములయందు నియోగించనెంచితి. తమరర్ధోక్తినే వినినారు కాఁబోలు.

ఇంద్రు:—(స్వగతము) నిజముగా పతివ్రత మోసపోవుచున్నది (ప్రకటముగా) లేదు. పూర్తిగా వినినాను. చమత్కారముగా నడిగినాను.

అహ:—ఈ యనుమానములే తమరు క్రొత్తగాతములని చెప్పుచున్నవి.

ఇంద్రు:—నీ సందిగ్ధముగ్ధభాషణములు నీవు నవీనాహల్యవుగాబోవుచున్నావనిగాదు, అయితివనే చెప్పుచున్నవి. గాతముని పరిశీలించుకొమ్ము.

విద్యార్థి:—(లోపల) మహేంద్రా! నీదొంగవేషము నాకుఁ దెలియును. లేచి రా!

ఇంద్రుడు:—(భయపడును) విద్యార్థులు లేచినట్లున్నది. ఆవలకు బోవుదమా ?

అహల్య:—వా రిక్కేలవత్తురు ? మన కేమిభయము ? ఎందులకో సిరికితన మేర్పడినది.

ఇంద్రుడు:—లేదు, లేదు. తలుపువేయకయే వచ్చినాను. నీవు ఒంటరిగా నుంటివని, లోనికి వత్తునేమోయని. ఇందులో సిరికితనమేమి యున్నది ?

అహల్య:—కవాటము తెరచియున్న పడకటింటికి విద్యార్థులు వత్తురా ? కాని, వేసివచ్చెదను రండు. (అని నిష్క్రమించుచున్నారు)

శచి:—(గౌతమాశ్రమమున) నేను సూక్ష్మరూపమున నాథుని వెనువెంటనే వచ్చినాను. అహల్య మోసపోయినది. పతివ్రతను మోసగించిన, నాథునిఁ గట్టికుడుపకమానదు. గౌతముడు స్నానము చేసి నాఁడు. వెడలుచున్నాఁడని నాపరిచారిక చెప్పినది. ముప్పు మూఁడనున్నది. మరుగుగానుండి జరుగువృత్తాంత మఱయుచుండెద. (అని నిష్క్రమించును)

ఇంద్రుడు:—(సంతోషముతో ) కృతకృత్యుఁడను. పట్టినపట్టు కొరవేరినది. బుద్ధి నుపయోగించి సాధింపఁదలఁచినఁ జేకూరనికార్య ముండదు. గౌతమాంగన తొలుదొల్త నన్నేవగించి తిరస్కారముగా మాట్లాడినను పునరాగమనము నభ్యర్థించినది. ఎట్టిస్త్రీయైనను అనుకూలపురుషసాంగత్యము దొరికినపుడు మన సీయకమానదు. గౌతముఁడు వచ్చువేళయైనది. నేనిట నుండరాదు. (నిష్క్రమించును)

శచి:—ఈరోజునకు గండము గడచినది. ఇప్పటికి నాయదృష్టము బాగుగనున్నది. అహల్య విచారములో మునిగినది. ఆమె దుఃఖాగ్ని మమ్ములఁ జుట్టకమానదు. నానాథునితోగూడ నిష్క్రమించెద. (అని నిష్క్రమించును.)

చతుర్థాంకము సమాప్తము.

---

# అహల్య.

## పంచమాంకము.

ప్రథమరంగము—గౌతముని శయ్యాగృహము.

గౌతముడు.—(స్వగతము) నాప్రేయసి దినదినము భిన్నమనస్కయై గనుపట్టుచున్నది. ఆచారవ్యవహారములయందు పరిపూర్ణశ్రద్ధ వహించుటలేదు, కర్మాచరమందు సహచారియయ్యెను,

సీ॥ ధమనించమన నగ్ని గమనించ దామాట
సమిధల నిడుమన్న జాగుఁజేయు
జ్వలియించు నగ్నిపై సమిధలు బడవైచి
ఘృష్టిచే ధమనింప నెంచుచుండు
నిడిచి చూడను పాలు పితికి తెచ్చియు బోయి
తిరుగ పాలను దాను తీయఁజూచు
మడిబట్టలనుగట్టి మరచిపోయి తినఁచు
తడిగుడ్డనేకట్టి తారుచుండు
గీ॥ పిలువ పదిమార్లు 'నేనేమొ వినఁగలేదు
మఱలఁ జెప్పు'డటంచును తిరుగుచుండు
నొకటి దెమ్మని చెప్పన నొకటిదెచ్చు
కారణం బేమొ తోఁచదు కనఁగ నాకు॥

క్షణమున కోకయలంకారముచేయును. ఎందుకో; తనలో తాను ముసిముసినవ్వులు నవ్వుకొనును. కంటికిఁ గడివెడునీరుగా నేడ్చును. నిన్నరాత్రి నావంటి దుష్టురాలు కలదాయని కలువరించినది. ఎన్నివిధముల నడిగినను కారణము చెప్పలేదు. మనోవ్యాధి కలిగినదా

నివలె శరీరము కృశించుచున్నది. చెప్పినమాటనే పదిమారులు చెప్పును. నిశీథిదాటినను, నిద్రవచ్చుటలేదని పురాణ గ్రంథములు చూచుకొనుట లేక, పదక్రమంబుల విద్యార్థులచేత వల్లెచెప్పించుట చేయుచుండును. ఒకప్పుడు పాదములొత్తుచుఁ గనులకద్దుకొని నాథా! మహాత్ములు. ఆఁడుదానను. నాయందెట్టిలోపములున్నను క్షమించి యుత్తమగతికల్పించుడని ప్రార్థించుచుండును. దీనికిఁగారణములు రహస్యముగాఁ దెలిసికొనవలయును. (అని పరుండవలయును.)

అహల్య:—(శృంగారవేషముతో ప్రవేశించును.) (స్వగతము) నాజన్మమెంత పనికిమాలినదిగా మారిపోయినది.

సీ॥ కన్నపుత్రునిమీఁది కనికారమెడలించి
కంఠంబు పిసికింపఁ గానునెట్టు
యన్నదమ్ములమీఁది యనురాగమును బాపి
ద్వేషించి వారినిఁ దిట్టఁబనుచు
తల్లిదండ్రులఁజూడ దయ్యాలుగాఁజేసి
నిర్లక్ష్యభావంబు నెరపఁజూపు
భర్తయందలిప్రేమ బాడుగాఁబడఁజేసి
సమయంబువచ్చిన సమయఁజేయు
గీ॥ పనులు పాటలు జేయఁగా మనసురాదు
యెపుడు జారుని గూడఁగా నెంచఁజేయు
మోహదీపంబు కనులను మూయఁజేయు
జారసహవాస మయ్యారె నేరమీరు॥

నాసతీ ధర్మములన్నియు నట్టేటఁబడినవి. ఈ సంసారప్రతిబంధము వదలి సర్వదా బలవైరితో కాలముగడుపు బుద్ధి పుట్టుచున్నది. బలవైరి సహవాస మయినదిమొదలు పగళులాలస్యమైనవి. రాత్రులు శీఘ్రముగాఁ బోవుచున్నవి. నేఁడు రాత్రిగూడ నిమ్మళముగా నడుచుచున్నదే. నిత్యము యేఁటికడకేఁగి 'జాముప్రొద్దు మిగిలియున్నదిః కోడి

యకాలమునఁ గూయుచున్నది; కారణమేమో'యని నాథుఁడు విచారించుచున్నాఁడు. ఇంద్రుడరుదెంచినది మొదలు చీమచిటుకన్న అదుగో నీనాథుఁడని యులికిపడుచుండును. భీతితోఁగూడిన సౌఖ్యము సౌఖ్యముఁగా నెన్నఁబడునా? ఒకానొకప్పుడు మాయిరువురి యానందమునకు భంగముఁగలిగిన ప్రతులనిపలుకులు. భర్తయాగమనము ప్రాణాపాయకరముఁగానుండును. ఈదినమున మాసుఖమునకు వియోగముకలిగిన సంసారత్యాగమొనరించెద. స్వర్నాథుని జాడ తెలియలేదు. సునంద పుష్పమాలికలు తేలేదు. నాపైకోపమా! శచీదేవి యీవిషయము నిత్యము కలహించుచుండునని సునందవలన వినుచుంటిని. శచియభ్యంతర మనివార్యమాయెనా? వేళకాలేదా? నిద్రరాకయున్నది. భర్తృపాదసంవాహనమొనర్చుచు, కాలక్షేపమొనర్చెద. నాదోషము నాభర్త గురుతెరుంగక యమాయకుడై నిర్మలానురాగము నాపై జూపించుచున్నాఁడు. (నిష్క్రమించును)

దేవేంద్రు:—పౌరుషము, బుద్ధిబలము సహాయముండిన సాధించరానికార్యముండునా? నాపట్టుదల నెరవేరినది. నాయూహ సరిపోయినది. అహల్యకు నాపై పరిపూర్ణానురాగము కలిగినది. ఈయరణ్యవాసము మిగుల కష్టముగా నున్నది. నిశీథిసమయమున మహేంద్రుఁడు నిత్యము వచ్చుట కష్టమని, సునందతో నేమేమో వచించి యనేక రహస్యసంభాషణలు చెప్పినదట. నాభార్య శచి ప్రతిక్షణము గౌతమునివిషయము శంకించుచునేయున్నది. ప్రతిదినము నావెంటబడి వచ్చుచునేయున్నది. (పైవంకఁజూచి) అదుగో! రథము! మాతలి! పులోమజ వచ్చుచున్నది. నేఁడు గట్టడిచేసెద. స్త్రీలకింతస్వతంత్ర మిడకూడదు. కాలచక్రమింత ముందుగాదిరుగుటకు గారణమేమయియుండవచ్చు? రాత్రి రెండుజాములు దాఁటలేదు. క్షణములు కల్పములుగాఁదోఁచుచున్నవి.

సీ॥ పరిమళవాయువుల్ వచ్చిసోకఁగ మేను
తరళాక్షి కైశ్యంబు దలఁపునకగు
కోవెల ల్వారికల్ గూయఁగా వెందైన
కలవాణిమాటయే దలఁపునకగు
వరటాంగనాతతి పరువారఁ గనుగొన్న
నలినాక్షి నడకలు దలఁపునకగు
మించు తీనెలు గను పించ నుదిరపుడె
తనుధిరూపము లోనఁ దలఁపునకగు
గీ॥ చిత్రమిది యేమి మాయయో చెప్పలేను
కనులఁగట్టినరీతిగాఁ గానుపించు
మనసు నిలుకడ నూనదు దినము గడుప
కష్టమగుచుండె నైన నే కష్టమిడునొ॥

(తనలో) అమంగళము శాంతించుగాక! (తెలివితో) నేనేమంటిని? ఎవరీమంగళము లాసంగినది. ఓహో, వాయుభట్టారకా! మీరింతగు గాపాడుచుండ నాకేమియు భయముండదు. పట్టమహిషి నమీపించినది. నేను మరుగుగాఁబోయి కోడికూఁత కూసెద. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

శచి:— (ప్రవేశము.) నానాథుఁడు మాయాలో మునిగినాఁడు. అహల్యా మహాసాధ్వియైనను కాలవశంబున దేవేంద్రుఁడొనర్చిన మోసకృత్యమునకు లోనయి కులటావృత్తి ననుసరించినది. నాభర్త కెన్నివిధముల బోధించినను నామాట వినకున్నాఁడు. పరకీయాసహవాసము ప్రాణాపాయకరము భీతిదాయకము. వ్యసనమందిరము.

సీ॥ ఫణిఫణావళిమీది మణిగోరి, హస్తంబు
సాచి పామునుబట్టు సాహసమ్ము
సింహావకాంతర స్థితకరికుంభంబు
విదళించ మదినెంచు విక్రమమ్ము

ప్రళయాగ్నికీలలఁ బట్టి ముద్దఁగఁ జేసి
దిగమ్రింగ నెంచెదు దీమసమ్ము
మృత్యువనోటిలో మెలఁగుజీవునిఁ దీయ
దలపెట్టె నెంచిన ధైర్యబలము
గీ॥ ప్రళయభైరవు నెదిరించు పాటిశక్తి
ఫాలనేత్రుని కనుమంట బట్టుశక్తి
గలిగియుండినఁ బరికీయు గలయుటకును
పనికి రాదది కష్టంబు పాలుసేయు॥

అట్టి ప్రయాసమున కోర్చి ప్రాణములపై తీపిగోసికొని, శరీరమును పాడుచేసుకొని, గౌరవాభిజాత్యములఁ గాలనేసి, క్షణకాలపుచ్చ సుఖమునకై దేవేంద్రుడంతటి బుద్ధిశాలి మృత్యువునోటిలోనికిఁ బోవుచున్నాడే! (బెదరుచు) ఎంతటిపాపమూ నానోటనుండి వెడలినది. పాపము శాంతించుగాక. నేటిదినమున నాభర్తకు నపాయము రానోపు, లక్షణములట్లగుపడుచున్నవి. (వినువు నభిముంచి) మాయాచరితా యుధస్వర్గమునఁ బోయుచున్నాఁడు. గౌతముని కంటఁబడిన పాపము ప్రబలమై దవాగ్ని యరణ్యములుగాల్చినట్లు కాల్చకమానదు. సూక్ష్మరూపమున సర్వముఁ జూచుచుండెదను.

(నిష్క్రమించును.)

రెండవరంగము.

సరస్వతి:— అమరనాథుఁడెంత మదోన్మత్తుఁడైనాఁడు. నంగసమైన విచారింపక బలవద్విరోధమును పరిగణింపక పాపపీడకు భయమందక యబల నన్యాయముగా మోసగించినాఁడు నానాథుని ప్రతిష్ఠయే నెరవేరినది. నాటినూజాతి ప్రథమమున మోసగింపఁబడినను విరమింపక కామవ్యామోహితయై కలుషకథాను వర్తియయ్యె. పురుషుల లాలింపులకు మాయచమత్కారములకు లోఁబడి వారియధీనమగుచు నాదౌర్బల్యము కలుగుటచేతనే స్త్రీజాతి కబలానామము సార్థక

మయ్యో. అంగల మహేంద్రుఁడొక్కడే మాయకాఁడు.

సీ॥ దారుకావనియందు తరుణులఁ జెఱఁబట్టి
శూలపాణియ త్రోవఁ జూపినాఁడు
పసిమిటివేషంబు చేసి బృందను బట్టి
శౌరి మార్గము జూప సాగినాఁడు
సన్యాసిరూపంబు సంతరించి యముండు
మోసగించెడుదారి వేసినాఁడు
ప్రాణరూపుండౌచు పవనుండు రాపట్టి
పడవేయు పంథను పన్నినాఁడు

గీ॥ పురుషులందరు స్త్రీలను మోసగించి
కల్లలనుబల్కి వారల మెల్లఁజేరి
మారువేసాలు వేయుచు చేరఁదీసి
నాథులనుబట్టి మొగతాళి గలుపుమిగుల॥

ఇప్పుడు గౌతముఁడు భార్యననుమానించి స్నానమాచరించకయె తిరిగివచ్చుచున్నాఁడు. నేటితో దేవేంద్రుని యనలేకంబు సార్థకమగు. ఇంక నాప్రతిన నెరవేరుమార్గ మూహించి యహల్యను పతివ్రతలలోఁ బరిగణింపఁజేయవలయు. రహస్యముగానుండి చేయఁదగిన కృత్యములఁ జేయుచుందును. సూక్ష్మరూపమున నిచ్చటనే యుండెద. (అని నిష్క్రమించును.)

(విచారముతో ఇంద్రుడు, అహల్య ప్రవేశించుచున్నారు.)

గౌతముడు:—తీవ్రముగా (ప్రవేశించి) నాయూహ సరిపోయినది. చిక్కినాఁడు దేవేంద్రుఁడు! ఛాందసులని మునులనుజూచిన నిర్లక్ష్యభావము జూపి నాగార్హస్థ్య ధర్మము పాడుచేసి నాకుటుంబమును గూల్చినాఁడు. రా, రా, బోనులోబడ్డ పులివయితివి. ఇంక బయటికి దయచేయుడు మహేంద్రుడుగారు! ఓ దొంగకోడిగారు! నంటుయింటి కందేలుగారు! దయచేయుడు. ఓసీ! దుర్మార్గురాలా! ప్రాచికోట

తాంబూలమా? మెడలోని పుష్పమాలికలఁ బారవేయకు. నీ యుప భర్తగారితోఁగూడ పడకటిల్లు వెలువడి రండు. ఈపాడు పర్ణశాలనివా సము మానివేయుడు. శచీయుంతఃపురమున త్రిదశరాణివి. బంగరుతూ గుటుయ్యాలల నూగుచుందువు. భీరువులు కాకుడు. స్వర్గేంద్రులకు లజ్జ యుండరాదు. మోసగించినంతదనుక గౌతముని మోసగించితివి. నిశ్చి ంతవుకమ్ము. మహేంద్రా! వజ్రాయుధముతో గౌతముని సరకనెంచు చుంటివా? శాపాయుధుడుగాని రాజుగాడు. మోసగించి చంపుటకు గౌతముడు తపస్సున సమాధిలో లేడు. లాలసించిన భస్మావశేషుండ వయ్యెదవు రమ్ము. ఋషీశ!

గౌతముడు: ఓ మందమానసస్వైరిణీ! ఓ ఆదితేయకులవార్ధి బడబానల! ఛీ! ఏమిపనిచేసితివి? నీ జీవితమున కెంతకళంక మేర్పర చుకొంటివి? నీచరిత్రాంశమున కెంతటి యపవాదు తెచ్చుకొంటివి? ఓ కృతకకృత్యవాక్స్వరామర్త్య! ఇప్పుడు నీ కీయుంకీ వ్రతకన్న మర్త్య త్వమునుండిన నెంతో యుపకారముగా నుండియుండును. పరిణామసంక ళికంకకృతి లేఖజవమా! నీ గ్రహచార మేమి కాలినదని దొంగకోడ వై మా యాశ్రమప్రాంతమున దేవులాడితివి? నీగౌరవమును రక్షించు కొనకపోతివే! అభిజాత్యము నడుగంటించితివే! మహర్షియు, పండితు డును, ప్రజాపతియునగు నీతండ్రి యౌన్నత్యమును జ్ఞాపకము చేసికొనక పోతివే! నీప్రభుత్వగౌరవమైన దక్కించుకొనకపోయితివే! తుదకు నీరాజసమైన బాటింపకుంటివే! ఇవియవి యననేల? నీవింతకుమున్ను మానంటివారి కపకారిమొనరించి పడినశిక్షలనైన తలచుకొనకపోయి తివే? ఓయి గురుద్రోహి! యిటువిను,

సీ॥ ఘటజాతమౌని క గౌరవం బొసరించి
తినుట కన్నము లేక తిరిగినావు
తపసియౌ త్రిశిరుని తలగోసి పడవేసి
పాపివై దేశాలు పట్టినావు

కడుపులో పిండంబు కరకుగత్తి నిగోసి
పెదతల్లిగోపాన ప్రిదిలినావు
బ్రహ్మహత్యనుజేసి పరువెట్టి పరువెట్టి
తామరతూడులో దాగినావు

గీ॥ బాసవాలుల తపములు పాడుచేసి
పొందరానట్టి కష్టాలు పొందినావు
సిగ్గులేదాయె నొకమాటు సీయటంచు
గడ్డిపెట్టిన నీబుద్ధి కాలిపోను ॥

ఓయి విశ్వాసఘాతక ! ప్రతిక్షణాపాయజీవితమగు నీవును నీపద మును నేలగూలుతఱి మావంటివారి పాదములపై బడినగాని గతిలేదే! ఎంత పొగరుబోతుతనము ! ఎంతమోసము ! ఎంతటి నీచకార్యము ! ముప్పదిమూడుకోట్ల దేవతలకు ప్రభుడవు. సమస్తదిక్జేతవు. సకల రాక్షసనికరజేతవు. మావంటి ఋషికోటికి శాసకుండవు. భూభృత్పక్ష విచ్ఛేదనాదక్షుండవు. జగదుత్పత్తిస్థితిలయకారధుండని యామ్నాయ ములు ఘోషించుచున్న నారాయణునకు సోదరుండవు. మహాసాధ్వీ శిరోరత్నమవై శ్రీమహావిష్ణువును కడుపునగన్న యదితికి ముద్దుపట్టివి. నీజీవితమంతయు దుష్కార్యములలోనే సరిపుచ్చి శిష్టోర్ధ్వుండవగుచుం టివే ! ఓయహల్యాజార ! దుర్మార్గుఁడవని యెఱింగి నీశిరంబు సహస్ర శకలంబు లగునట్లు శపింపక సన్నిఁయిలాతలంబున ద్యుతలంబున బ్రతు కనిచ్చిన మా మునికులంబునకు బుద్ధిసెప్పి మాకొంపల గూల్చనెంచి తివి గావున పరమైశ్వర్యామయపన్నిపాతవివశీకృతశేముషీవిశేషుండ వగు నీవు కీర్తిశేషుండవయి యుండునట్లొనర్చినగాని సాధుబాధ చల్లారదు. ఓరీ స్వర్గరాజ్యమదోన్మాద ! నీబుద్ధి బుగ్గియయినదా ?

సీ॥ జలరాసి నొకగ్రుక్క సలిపి జీర్ణముచేసి
కొనిన ధీరుఁడు మాని కులమువాఁడె

అన్యమింద్రం కరిష్యామ్యహ మ్మనిపల్కి
ప్రతిసృష్టి సల్పిన వాఁడు మునియె
చావుపుట్టుకలేని సర్వేశు శపియించి
మాయముంచిన వాఁడు మౌనివరుఁడె
మూర్తిత్రయంబును ముంగాలవడిదన్ని
ప్రఖ్యాతి వడసిన వాఁడు మునియె
గీ॥ లోకజాలము తమచేతి లోన నునిచి
కొనియు నీకును నీసేవకును తినంగ
తిండిపెట్టెడు వారలు ద్విజులె సుమ్ము
గొడలు మాఁచితి యింతలో గడచినావె॥

గౌతమతపోపరిమాణము లోకమిప్పుడె చూచుఁగాక! మరణమునకు సంసిద్ధుఁడవగుము.

ఇంద్రుఁడు:—(వినయముతో) మహిమాన్వితుఁడగు నీపుత్రుఁడు ప్రాణరక్షణఁ గోరుచున్నాఁడు. (అని పాదములమీఁద బడుచున్నాఁడు.)

శచి:—(యాతురతతో) పతిభిక్ష! పతిభిక్ష! సంరక్షించుము! కాపాడుము! ప్రాణదానము! ఆడుపడుచు! ప్రార్థన! (అని నమస్కరించి)

సీ॥ కావుమా మునిచంద్ర కావుమా గౌతమ
కావుమా శమరూప కావు కావు
సాకుమా చరణాక్షి సాకుమా పరమేశ
సాకు కృపాశీల సాకుసాకు
బ్రోవుమా జడధారి బ్రోవుమా యగవైరి
బ్రోవుమా దయరూపి బ్రోవు బ్రోవు
మనుపుమా సంయమి మనుపుమా ఋషివర
మనుపుమా, యఘదూర మనుపు మనుపు
గీ॥ వేడుకొనెదను మ్రొక్కెద వినుతిసేతు
కేలుమోడ్తును దండంబు కేలుగంటు

నతులు జోహారు వినతి నందనముమోడ్పు
దోసిలొగ్గుదు నంజలి దోయి యిడుదు॥

(నమస్కరించి పైటచెరుగుపట్టుకొని) శమనశీలుడవగు నీ కీయల్పునిపై నింతకోపమా! తూటికూరకు చంద్రహాసమా? కన్నబిడ్డలు కావించు నపరాధములఁ దల్లిదండ్రులు లోగొనకున్న పరులు కాపాడువారుందురా? నీకొమరిత వైధవ్యదుఃఖమొందిన నీకు దుఃఖముకాదం? ప్రాణదానము! పతిభిక్ష! నీ పుత్రిక! నీ యాడుపడుచు! పసుపుకుంకుమ! మన్నించుము! వందనము. వందనము.

గౌతముఁడు:—(కోపముతో) ఛీ! యభాగ్యురాల! మాదివ్యదృష్టిని సర్వము తెలిసికొనినాము. నీ మాయాకృత్యములు మాకుఁ దెలియకపోలేదు. నీ యకార్యారంభములు మాకు గోచరములు కాకపోలేదు. నీ యకృత్యములు మాకు పొడగట్టకపోలేదు. కుహనాస్వరూపురాలవు. ఈ కుమార్గానువర్తనుని కృత్యములకు లోఁబడి యకార్యమాచరించి యిప్పుడేడ్వనచ్చితివా? బిచ్చగాడగు గౌతముని భార్యను వంచించిన భయములేదని యెంచితివిగదా?

శచి:—విజ్ఞానదృష్టిచే లోకత్రయము పరికింపఁదగిన మహాత్ముఁ డెంత నసత్యములు పలుకలెతవు. శచీభాగ్రిత పరీక్షించబడవలసినదియే ఈ యకార్యము పులోమజపతిమున కళంకముండిన తామ క్షమింపవలదు. తగినశిక్ష యొసంగుడు.

గౌతము:—ఓహో! పెనిమిటిమాట దాఁటుగూడదని సాధ్వీధర్మమును మండఁబెట్టితివికాఁబోలు! అహల్య నీవంటి యాఁడుదిగాదా? మంచిది. మించినదానికి యోజనలిపిన లాభములేదు. అగ్నియంటినఁ గాల్పకమానదు. మీకర్మ మీ కనుభవము కాకమానదు. నీయేడుపు విన మాకు జాలికలిగినది. మీరు చచ్చిన మాకేమిలాభము? బ్రతికియుండి జన్మాంతము గౌతముని జ్ఞాపకముచేసికొనుచు దుష్టకార్యమొనరింపబోవువారికి దేవేంద్రుఁడు నిదర్శనముగాఁగఁ గనుపడుచు

నిట్టిపాపకార్య మొన్నఁడొనర్పఁజాలకుండ నిర్వీర్యమునైౖ యుండున ట్లొనర్చెద. మహేంద్రా ! యేవస్తువ నాశించి యింతటి యకృత్యమొనర్చితివో యావస్తువ నీకు ప్రీతిగావున, నీ శరీరమున సహస్రయోన్యాకారము లుద్భవిల్లుగాక ! "యత్రాపరాధః ఖలు తత్ర దండ్యః" కావున నిఁక స్త్రీలకు నీవలన బాధకలుగకుండ విగళితముష్కుండవై సుఖంపడుదుగాత ! దినదినక్షీణీకృత సత్వుండవై, ప్రాణమాత్రావశిష్టుండవై, శచీమంగళసూత్రసంరక్షణ మొనర్తువుగాత ! సమయము వచ్చిన పండితుఁడు కాల్చు పండుకాల్పును కనుగొనుచుండుము. బుద్ధి గలిగి బ్రతుకుము.

ఇంద్రుః:— జీవచ్ఛవము బ్రతికిమాత్రిము చేయునదియేమి ? ఆ ముత్యమంత ప్రాణముమావిగూడ సెలవొసంగుడు. నేఁటికి మహేంద్రునిత్రవాత యిట్లుకాలినదిగాని సృష్టిలో కామవ్యాపారమునకు లోనుగానివారలు గలరా ?

సీ॥ శుక్రునిభార్యపై శుచిగల్గి గురుఁడెంత
పాపకార్యముచేసి ప్రబలినాఁడు
గురుభార్యతోఁగూడి చిరకాలముండిన
చంద్రుండు పూజ్యుఁడై చలినవాఁడు
మేనకాంగనతోడ జానుగా సౌఖ్యంబు
గాంచి గాధేయుఁడు ఘనుఁడుకాఁడ
కన్నకూతురుగాంచి కామించి వెనువెంట
బడి ధాత విఖ్యాతి బడసినాఁడు
(తెరలో)
ఇంతటితోడ నోరత్తక, చావుదప్పినది, సంతోషించి లేచిపొమ్ము.

ఇంద్రుః:—ఎవరు నన్ను కఠినముగా నాపించువారు ?

(తెరలో) చేసినపనికి సిగ్గుపడక మాట్లాడుచున్నావా ?

శచి:— మీయత్త శారద! తల్లీ! నమస్కారము. అకార్య మొనరించినప్పు డంద రవమానింతురు, ఆదరించువా రరుదు. చచ్చిన పాము, తామసమేల తల్లీ?

గౌత:— ఇంక చక్కట్లుదిద్దక నాయెదుటనుంచి నీభర్తను తీసికొనిపొమ్మ. మీరిరువురు నా కపకారులే. నా బ్రాహ్మణధర్మమే నన్ను శాంతవంతునిఁ జేయుచున్నది. మీ సంభాషణ తామసాగ్ని రగులుకొలుపుచున్నది. దుర్మార్గులస్వభావమింతే. తాము శిక్షనొంది, సిగ్గుపడక కారణాంతరమునఁ గలిగిన పెద్దలయందు గనుపడిన దోసములను వెదుక మొదలిడుదురు. ప్రపంచము బ్రహ్మసృష్టిగావున నందరికిఁ దండ్రియే. మహితాగమునదోష మాపాదించుట మూర్ఖధర్మము. యోచించిన ధర్మసూక్ష్మములు పెక్కులు. (ఇంద్రుడు, శచి నిష్క్రమింతురు.)

గౌతముడు:— ఛీ! యాతుధానినడువకీ! కర్మబ్రహ్మవాదియగు గౌతముని యర్ధాంగివి. ఎంతనీచకార్య మాచరించి యుభయవంశచారిత్రమందు కలంకమేర్పరచి ఎంత యపవాదపాలయితివి! ఎంత సాహసము! ఎంతమాయదారితనము! ఎంతకుహనాస్వభావము!

సీ॥ ఎండమావుల వారి యుండవచ్చునుగాని
యాతుధానికి మోహ మమరు టరుదు
గుఱ్ఱంపునెత్తిపైఁ గొమ్ము వచ్చునుగాని
వెలఁదికి సత్యంబు వెలయుదెపుడు
పొల్లున బియ్యంబు పొందవచ్చునుగాని
కాంతాస్వభావంబు గానరాదు
వంధ్యాతనూజునిఁ బడయవచ్చునుగాని
వెలఁదిరహస్యంబు వెలికిరాదు
గీ॥ తెల్లనైనట్టికాకి కుందేటికొమ్ము
రావిపువ్వులు వడగండ్ల రాసి నిప్పు

కలుగవచ్చును భూమిలో కాంతమర్మ
మరయగల్గినచతురుఁ డే ధరణిలేఁడు!

(విచారపడి) ఆఁ! గౌతముఁడు మాయాబద్ధుఁడా? అహల్యాదుర్వ్యాపారశృంఖలాబద్ధుఁడా? అవిదితకాంతావిలాస మాయావిద్యాప్రభావుఁడా? అవిజ్ఞాతమహేంద్రమార్గాండప్రవర్తనాథోగాధమాయాధ్వాంతకాననపర్యటనుఁడా? కాఁడు. కేవలకర్మకుఁడు కాఁడు. పరమఛాందసుఁడే కాఁడు. లోకవ్యవహారప్రజ్ఞాదక్షుఁడు. సమస్తలోకనాశనప్రజ్ఞావిశేషతామసానిర్వచనీయకార్యధూర్వహుఁడు. కర్మక్షయంబయిన నగుగాత, లోకంబున స్త్రీజాతి నడుగంటించెద. సృష్టినష్టంబయిన నగుగాత, మానినీమారణహోమారంభ మొనరించెద. స్త్రీసౌందర్యశోభాలంకారముల రూపుమాపెద. వనితావిలాసంబులఁ జిలిక జిలికలుగా నాచరించెద. అహల్యాకారణమున జగంబుల నాడువాండ్రకుం గలిగినయపవాదు నాచంద్రార్కము స్థాపించెద. (19) హా యమా! స్త్రీభావము వహింపుము. జగత్సృష్టిసంహారణనిదానంబ వగుము.

సరస్వతి:—(ఆతురతతో) మహర్షీ! శాంతించుము.

గౌతము:—తామససముద్ర మతివేలమయినది.

సరస్వతి.—కారణము?

గౌతము:—స్త్రీదుష్టవ్యాపారచంద్రోదయము.

సరస్వతి:—విధిపరిణామమునకాదేమి ?

గౌతము:—ఆ సందేహము గౌతముఁడు తీర్చుచున్నాఁడు. పురుషకార, విధిపరిణామముల జయాపజయములు లోకంబుల వెల్లడి కాఁగలవు.

సరస్వతి:—చర్వితచర్వణ మేలగావించెదవు? కార్యము కారణమును నశింపఁజేయునా? కుండచే మట్టి నశింపఁజేయ యత్నించుటఁ గూడ పరిహాసాస్పదము.

గౌత:—నీటిచే నగ్ని చల్లారుటలేదా? నీటికి కారణముగాదా?

సరస్వతి:—కాదు. జన్యజనకభావము, వ్యక్తిభేదము, స్థూలరూపమును చల్లార్చినను సూక్ష్మమును—

గౌత:—ఎవ రీశాస్త్రపారంగతులు? అదృశ్యమేమి గ్రహచారము? బయటబడరాదు? అక్కఱలేదు. ఇది సమయముకాదు. కావలసినంత శాస్త్రము చేయగలను. దయచేయుము.

సరస్వతి:— లోకాపకారము చేయఁగూడదు. న్యాయవిమర్శనానంతరము శిక్షావిధానము. ఇదిగో! వెలువడితిని. శాసించుచుంటిని.

గౌత:—(ఆశ్చర్యముతోఁ జూచుచున్నాఁడు.)

అహల్య:—తల్లీ! కాపాడుము. (సరస్వతికి సాష్టాంగనమస్కారము చేయవలయును.)

గౌత:—(కోపముతో) ఛీ! నీమొగము చూడరాదు. ఎదుటికేలవచ్చితివి? ఇంక లేవకు. పాషాణప్రాయస్థవై పడియుండుము. అనంతరవిధానము విచారణీయము.

సరస్వతి:—(స్వగతము) కార్యము గతించనే గతించినది. ప్రాణాపాయము లేదుగదా, -(ప్రకటముగా) దుస్సాహసము బ్రాహ్మణగౌరవహాని, కర్మఫలిఘాతుకము, పురుషులకు స్త్రీలయందుగల స్వాతంత్ర్యము సర్వదా నిరంకుశమేగదా? రెండుమాటలు మాట్లాడుకాలము సహనము తగదు కాఁబోలు?

గౌత:—సహనము లేకపోవుటా? సమయానుకూలప్రవర్తనము. మృదులస్వభావులగు సోమపీథులు యజ్ఞంబులఁ బశువులబట్టినపుడు దయానురాగములు విడనాడి దారుణకృత్యముల నాచరించుటలేదా? అది పాపకార్యమగునా?

సరస్వతి:— నీ భార్యయం దణుమాత్రమైన దోసములేదని దానిప్రారబ్ధ మీయపవాదు దానికిఁ బ్రాప్తించినదికాని బుద్ధిపూర్వకముగాఁ గలిగినదికాదు. ఈ విషయము దివ్యజ్ఞానముగల నీకు నావం

తగ్గైన దాపురముండదు. నీరూపువహించిన పురందరుని వరించినది గాని పురుషవాంఛచే నీదుష్టకార్య మాచరించలేదు. నీవు కర్మబ్రిష్ఠ వాదివి. నీమాట వ్యర్థముగాదు. ఇప్పుడు పాషాణప్రాయినగు మనిన మహాశాపముచాలును. నీభార్యను పరిశీలించుకొనుము. విచారతాప మునఁ గృశించి నీశాపాయుధఘాతమ్మున మూర్ఛమునింగినది. పునరుద్ధ రణోపాయము చూచికొనుము.

గౌత:—(అహల్యనుచూచి) స్థబీభావము వహించినది. ప్రమా దము తటస్థించినది. శారదా! నమస్కారము. దుస్సామపమునుండే తొలఁగించితివి. ఈ నాటకము నీ చిత్తమువచ్చినపుడు నీయిష్టానుసార ముగా నడుపుము.

సరస్వతి:—నీమాట యమోఘము. నాబిడ్డను బ్రతికించుటకు నా కొకయుపాయము తోచుచున్నది. (20) శ్రీమహావిష్ణు రాముడుగా నవతరించి భూలోకకంటకులైన రావణాదుల సంహరించును. రామ పాదపరాగముచేత నీభార్య బ్రతికించెద.

గౌత:—(యోజించి) ఇంకఁ పదునొకండువేల వత్సరములకా తిరిగి గృహస్థాశ్రమమును స్వీకరించుట!

సరస్వతి:—కాలపరిణామము విచారణీయము. మించినపనికి యోజన లాభములేదు.

గౌత:—ఆ కృత్యములు నీయవి. శతానందునిసంరక్షణ నీయది. విధురుడగు గౌతముడు నీముఖము చూడఁజాలడు. ఆశ్రమము విడుచుచున్నాడు.

(అని నిష్క్రమించును)

ఆశ్రమసమీపభూమి.

గౌత:—(స్వగతము) కోపము నా విజ్ఞానమంతయుఁ బాడుసేసి నది. నా కర్మప్రయోగాదర్శమంతయు మలినము గావింపబడినది. నా ప్రజ్ఞానమంతయు విధ్వంస మొనరింపబడినది. గృహస్థాశ్రమసౌఖ్యబీజ

ములన్నెల్ల నంకురరహితముగా మాడ్చివేసినది. ఆహా! కాలవిధానము! సుడిగాలివలె గౌతమునిఁ బ్రజ్ఞావిశేషముతోఁగూడ ద్రిప్పి, ద్రిప్పి, యజ్ఞానదుర్గమారణ్యగిరిగృహాంతరాళమ్ములనఁ బారవైచినది. మతిభ్రమణమైనది, దిక్కు దోచుటలేదు, గార్హస్థ్యకుటీరాచ్ఛాదన మెక్కడికో యెగిరిపోయినదే! ఈ గౌతమునికి నిలువ నీడ లేకపోయినది. ఆశ్రమప్రతిపాదితమైన కర్మ సర్వము భ్రంశమయినది.

సీ. సర్వదా మీసేవ సలిపెడు నిల్లాలు
బండగాపడె హవ్య వాహులార
మిమ్ము పోషించు మా కొమ్మ నేఁడుగతించె
నరుగు డెందైన విద్యార్థులార
అమృతాన్నమిడెడు నా యతివ మూర్ఛనుజెందె
నన్యులఁ జేరుఁడో యతిథులార
గృహకృత్యములఁదీర్చు గృహిణి మోహముఁబెందె
వదలుడు హవ్య కవ్యంబులార
గీ. కర్మలార శుభప్రాప్తి కరములైన
వ్రతములార నియమములార యికనన్ను
విడిచిపెట్టుడు గౌతము నిధుడు నిపుడు
పొందు మీతల్లి యెడఁబాసి పోయె పొందు.

కోపవివ్హలీకృత స్వాంతుండనై వెనుకముందు విచారించలేక పోయితిని గాని. నిజముగా విచారించిన నహల్యయం దపరాధము కానుపించదు. భర్తృవేషము ధరించిన దేవేంద్రుని మనోభీష్టము నెరవేర్చినదిగాని కేవలము కాముకవ్యాపారముకాదు. ఈమోసకృత్యమంతయు మహేంద్రునిది. ధర్మశాస్త్రములు పరికించిన బలాత్కారమున జరిగినదానికి, నజ్ఞానకృతమునకు నల్పప్రాయశ్చిత్తమందురు. ఋతుమతియగుచుండు స్త్రీలకు వ్యభిచారదోషముండదని ధర్మశాస్త్రములు

పలుకుచుండ మాసిమాసి, విధాయక కృత్యములు జరుపుభార్యపై నిష్కారణ మపవాదు గట్టితిని. (తెలివితో) భార్యామోహపరాధీనీ కృతస్వాంతుడనై, యేమేమో హేతువులు సరిచూచుకొని, నిర్దోషురాలిగా నెంచి పశ్చాత్తాపపడి, విచారించుచుంటిగాని, మహేంద్రుడని యెఱింగిన పిమ్మట వానితో మనస్ఫూర్తిగా క్రీడించిన దుర్మార్గురాలిపై నాకు దయయేటికి? కావలసినవిధి చక్కగా నెరవేరినది. పాంసులాపదవిన్యాస యపవిత్రీకృతంబగు నీయాశ్రమము పరిత్యాజ్యము. అశ్వైశ్యము. చండాతపవాయుతప్తమై పవిత్రంబయినపిమ్మట రామపాదపరాగపవిత్రీకృతదేహను గాంచెద.

(అని నిష్క్రమించును.)

పంచమాంకము సమాప్తము.

# అహల్య.

## షష్ఠాంకము.

ప్రథమరంగము – స్వర్గము – విచారసౌధము.

ఇంద్రుడు :—(స్వగతము) కనులు మూసినంతకాలములోఁ గల కని మరచినట్లు దేవేంద్రుఁని గౌరవము, వైభవము, సౌఖ్యము, శరీర పటుత్వము, సౌందర్యము, మెరుపు మెరసినట్లయి కనులకు విభ్రమము గొలిపి యెక్కడనో మటుమాయమైపోయినది.

సీ. కామినీ మత్తేభ కరవిఘాతము లేక
పురుషమృణాళము ల్విరుగు టెట్లు
మానినీముఖచంద్ర మండలాకృతి లేక
పురుషధైర్యాబ్జముల్ ముడుచు టెట్లు
చంద్రాననాహాస జాలకావళి లేక
పురుష శకుంతాళి దొరుకు టెట్లు
భ్రమరాలకాలోక బాణఘాతము లేక
పురుషమృగంబులు సురుగు టెట్లు
గీ పొలఁతి నయగారిచేష్టల న్భూరిమంత్ర
బలముగాకున్న పూరుష పన్నగంబు
కట్టువడు టెట్లు మాయను ల్గారె మీన
లోచనలు లేక పురుషులు లొంగగలరె.

ఎన్నివిపత్తులు కలిగినను వారియందుగల మహిమావిశేష మేమొ, దాసానుదాసులై సేవలొనరించి తుదకు వారిచే పరిత్యక్తులై వియోగసాగరంబున మునిగి దరిగానక గ్రుక్క త్రిప్పుకొనలేక ప్రాణ

ముల విడుతురు. ఈ విషయమునఁ బూర్తిగా వలనుపడదని మొట్టమొదటినుండి పట్టువట్టినది నాభార్య. బుద్ధిజాడ్యము హితోపదేశమును సహించనీయదు. వజ్రంపుతునకవంటి నాదివ్యశరీరమున కెట్టిదుస్థితి ప్రారంభించినదో! చూచుటకసహ్యము. చెప్పుటకు సిగ్గు. అవాచ్యము. పరమఘాందసుఁడైనను, యెట్టిశిక్షవిధించినాఁడు! ఇంతకన్న మరణము మేలు. పండితుఁడుగదా లోకజ్ఞానముండునాయని పొగరుబోతుతనమునఁ బదిమందిలోఁ దిరస్కారముగా నానాఁడు మాటాడినందుకు నన్నిట్టి దుస్థితిలోనికిఁ దెచ్చినాఁడు. గౌతముండు నాకిడినశిక్షకన్న మరణము సహస్రాంశములు మేలుగానుండును. ఏవస్తువ నపేక్షించి దొంగకోడినైతినో యావస్తువును పలుమారుచూచుకొనుచు సర్వదా సేవించుమని సహస్ర నీచప్రదేశములు నాకొసంగినాఁడు. పైవస్త్రముఁ దీయుట కసహ్యముకదా. ముఖమెట్లుగప్పుకొందును? తలయెత్తుటెట్లు? బంగారువంటిశరీరము పాడయినదే! ప్రభువునను గర్వము నన్ను పాడు చేసినదే. మునిజనతిరస్కారము నన్నధోగతిపాలుచేసినదే శివ! శివ! ఈ ప్రదేశములనుండి యింతమురికికంపు వచ్చుచున్నది. ఈ దుర్వాసన నెట్లుసహింతును? సౌఖ్యమనుభవించిన కాలము క్షణములో పోయినదే. సమస్తజీవలోకమునకు పండితతిరస్కారవ్యభిచారకార్యముల నధోగతిపాలగుదురనుటకు నీ దేవేంద్రుఁడు ప్రబలమగుసాక్షిగా జేసినాఁడు (బాధనభినయించి) ముష్కము లూడిపోయినవి. దైవమా! నన్ను నిందించు పగవానికయిన నిట్టిశిక్ష, యిట్టిబాధ రావలదు. ఋషితిరస్కార మెంతటి విపత్తునమఁంచినది! ముంచనున్నది! ఈ మహేంద్రుఁడు ప్రకృతము గౌతముఁడొనరించిన సన్న్యాసిగానున్నాఁడు. విధి బలనంతము! చిత్రము!

సీ. అన్యాంగనాభిలాష మ్మంతరింపఁగఁ జేసె
పాకశాసన దివ్య వైభవంబు

దండితద్వేషంబు పాపాత్మగాఁ జేసె
బలవైరిపుణ్య సంపదనడఁచి
గర్వాంధకారంబు గ్రమ్మి గ్రుడ్డిగఁ జేసె
వృత్రారివిజ్ఞాన వృత్తినంత
స్వేచ్ఛావిహారంబు శిక్షార్హుగాఁ జేసె
నగవైరి పౌరుషం బెగరగొట్టె
గీ. పండితద్వేషగర్వ విభ్రాంతు లన్య
సరసిజాక్షిన మోహము య్యారె, యెంత
కష్టములపాలుసేయునో, గన్నవాఁడు
త్రిదశనాథుఁడు జనులార తెలియుడింత.

అసహ్యమై, యనిర్వాచ్యమై, యఘదాయకమగు దేవేంద్రుని చరిత్ర స్వపరసౌఖ్యవినాశకారణ మైనది. వలదని యహల్య యెంత బ్రతిమాలినది! నిజముగాఁ బతివ్రతను తుట్టతుదకు మాయోపాయమున మోసగించి ఆమె సంసారమును గూల్చితిని. అహల్యా! యీ కష్టసమయమున నొక్కసారి నాయెదుట సాక్షాత్కరించిన సకలదుఃఖ నివారకమగును. మనోవృత్తులు నిర్మలములగును. అయ్యో! యెంత పిచ్చివాఁడను! నిర్జీవవగు నీ వెట్లురాగలవు? నా శిక్షకంటె నీశిక్షయే మెరుగు. మూర్ఛావస్థ సుఖదుఃఖావస్థల నెఱుంగదు. సప్రాణినగు నాపరితాపముకన్న నీయవస్థయే బాగుగానున్నది. (తెలివితో) మించి నపనికై యోచించుట సమంజసముగాదు. ఆ యక్షపాదునిపాదములపై శిరంబు మోపి తిరుగా బ్రార్థించుటయే నాగతి. ఈ దుర్వాసనకు సేవకులు పరిచర్య నొనరింప సమీపించుటకు భయపడి వెనుదీయుచున్నారు. తుద కీమహేంద్రుడెంతటి దుస్థితిలోనికి వచ్చినాఁడు! హా! పులోమజా! నీవుకూడ నీభర్తను జూచుట కేవగించుకొనుచున్నావా? (కోపముతో) పాపురాలా! అనాఁడు గౌతముఁడు శాపంబొసంగుసమ

యమున నష్టమువచ్చి ప్రాణముదీయకుండ నన్నింతటి యిక్కట్టులపాలు చేసినదానవు నీవు. నీకెల్లబొల్లి యేడ్పులు లేకున్న నీపాటికి మహేంద్రుఁడు నామమాత్రావశిష్టుఁడగువాఁడు (శాంతముతో) "బ్రతికియుండిన సుఖములఁ బడయవచ్చు." మొదటినుండియు హితము బోధించి నదకుఁ బ్రాణములొడ్డఁగిన పతిశిరోమణివి, నన్నుఁ దిరస్కరించితివే యింతటిచేటు దెచ్చుకొంటివి తిరుగ నిన్ను ద్వేషించు వృషాకపిని ప్రాణములుపోవునట్లు శపించుము. నీ శాపాగ్నికి నెదురు లేదు. చల్లారదు. భర్తృమనోరథము పరిపూర్ణముచేసి, సతీధర్మమునకు వన్నె బెట్టుము. రమ్ము. ఎవడురా అక్కడ? మహారాణిని పిలిచికొనిరమ్ము.

సేవ:—(ప్రవేశించి) రాణిగారు సత్యలోకమున కేఁగినారు తిరిగి సూర్యమండలము సమీపించినారు. ఇపుడే రాగలరు.

ఇంద్రుడు:—ఉపాయాంతరాన్వేషణార్థ మేగియున్నది. లోకములో గృహస్థులకు సద్భార్య లభించుటయె యీశ్వరానుగ్రహము పూర్తిగాఁ గలిగి సర్వసుఖంబులందుట.

సీ. ప్రాణరక్షణఁజేసి ప్రాణేశ్వరీయన్న
సంజ్ఞ సార్థకముగా సంతరించె
జీవదానమొసంగి జీవితేశ్వరియన్న
పేరు సార్థకముగా వెలయఁజేసె
గృహరక్షణముఁజేసి గృహిణీయనెడి నామ
మర్థవంతముగాగ నలముకొనియె
ధర్మసహాయమ్ముఁ దాఁజేసి సహధర్మ
చారిణీ యనుకీర్తి సాగఁజేసె

గీ. వీర! సద్భార్యలభియింప నందరాని
పదవియున్నదో కలుముల పదమె యిల్లు
ఆమయంబుల కౌషధ మాధబాధ
సహనయింపఁగ మంత్రమై యలరుభార్య!

ఆ గుణవతియగు భార్యమాట వినకపోవుటచేతనేకదా. అసహ్యమగు రూపము, అగౌరవము, షండత్వము, సంపాదించుకొంటిని. ఇంతకు నెంతవారికిం బ్రాక్తనకర్మఫలానుభవము వ్యర్థముగాఁబోవునా ? అనుభవించితీరవలయును. నిజముగా విచారించిన నిదిమాయ. ఎక్కడి శాపానుగ్రహములు. ఎక్కడి సుఖదుఃఖములు ! ఎక్కడి బంధమోక్షములు ! సర్వము మాయాగుణవిలాసము. సంసారప్రవాహము. సుఖదుఃఖములు వాహినులు సికతారేణువులంగూర్చినట్లు, సంయోగవియోగములు కలుగఁజేయుచుండును. విపత్సమయంబున నార్తత్రాణపరాయణుండగు నారాయణుఁడే స్మరణీయుఁడు భగవన్నామామృతపానము సర్వామయనివారకము.

(తెరజారును)

విశ్వామిత్రాశ్రమము — ద్వితీయరంగము.

విశ్వామిత్రు :— నిశ్చయముగా నాశరమాణోపాయము కర్తవ్యము. మారీచసుబాహులు చెలరేఁగినారు. తాపసాశ్రమములు తల్లడిల్లుచున్నవి. వైదికకార్యములు భస్మీపటలము లగుచున్నవి. సప్తతంతూపక్రమణములు సన్యస్తములై. ఔరా ! దానవులదుండగములు నిష్కారణముగా మునికులంబులపై వ్యాపించుచున్నవి. కరణీయమేమి ? (యోజచేసి) కరణీయము దానవసంహారమే. (క్రోధముతో) ఓయీ ! శాడబకలాపకారి ! నీ కాయువ మూడినది. నెనిచో నీ వీ యకారణబ్రాహ్మణకలహము బ్రారంభించవు. యజ్ఞకార్యవిఘాతుకము లాచరింపవు. నిక్కముగా నేగాధేయుఁడు కన్నెఱచినఁ గట్టెదుటఁ గాలిపసకడుబూదిద కాఁగలవు. మీకీస్వేచ్ఛావిహారవరం బొసంగిన బ్రహ్మయు తిరిగి జన్మించవలసినదే.

సీ. సృష్టికిఁ బ్రతిసృష్టిఁ జేసి గాధేయుండు
రండవబ్రహ్మగా నుండినాఁడు.

క్షత్రియాన్వయమందు జన్మించి బ్రహ్మర్షి
తేజంబు తెల్వి సాధించినాఁడు
కోపించి స్వర్గంబు క్రొత్తగాఁజేసి త్రి
శంకునిందు నిఁజేయఁ జాలినాఁడు
వాసిష్ఠులందరి భస్మంబుగాఁజేయ
బిట్టుగా శాపాగ్నిఁ బెట్టినాఁడు
గీ. స్వర్గరాజ్యార్థపీఠ మా చంద్రతార
కముగఁ దైత్రిశంకునకొసఁగ కక్షచేత
రాక్షసాధమ యిపుడె నీ ప్రాణములను
తీయఁజాలఁడొ చూడు గాధేయుశక్తి.

స్వసైన్యబలవాహనుండవై క్షణకాలములో—

సరస్వతి.—(ఆతురతతో సదృశ్యముగా) వద్దువద్దు. బ్రహ్మర్షివి. నీ వీకార్యము చేయఁదగదు.

విశ్వా:—ఈ దుస్సామసమునుండి నన్నుఁ దొలంగించిన ధన్యాత్ము లెవరైయుందురు?

సరస్వతి:—చిత్తైకాగ్రత వహింపుము. (ప్రత్యక్షముగావలయును.)

విశ్వా:—(క్షణముయోచించి) తల్లీ! శారదా! నమస్కారము. పూర్వవాసనలు వదలుట దుస్సాధ్యము. ఈకోపమేగదా నన్నెకపర్యాయములు తపోభ్రష్టునిగా నొనరించినది. ఔరా! జన్మవాసన. పిచ్చిగుంటుపై గంగాప్రవాహము వెల్లువయై పారుట కేమి కారణము?

సరస్వతి:—వినియుందువు. గౌతమాంగన శిలాప్రాయమై పదివేలవత్సరములగుట. గౌతమశాపాగ్ని కింధనమాయెగదా.

విశ్వా:—పుత్రికావ్యామోహము తల్లులకు దుర్నివార్యము.

సరస్వతి :—రావణబాధాపనోదనార్థము శ్రీమహావిష్ణువు రామనామధేయుఁడై దశరథునకు సోదరత్రయసహితుఁడై జన్మించుటయు శ్రుతపూర్వమే.

విశ్వా :—అవును. ఇప్పటికి ద్వాదశవత్సరములు గతించినవి.

సరస్వతి :—శాసించుట బ్రాహ్మణధర్మము. శిక్షించుట క్షత్రియధర్మము.

విశ్వా :—(తలపంకించి) శారదా ! నమస్కారము. నాతామసపిశాచమును పూర్తిగా వదలించినావు స్మరణకు వచ్చినది. రావణవధారూపకప్రదర్శనమునకు నాందీప్రస్తావనలు సలుపవలయునని యాజ్ఞాపించినావు. యుక్తమయినది. పొరబడినాను క్షమించుము.

సరస్వతి—అహల్యాశాపవిమోచనము నీవు ప్రారంభించు నాటకమున ద్వితీయరంగముగా నిర్మింపుము. తదనంతరము మంథరావేశితస్వాంతనై తృతీయరంగప్రసాధన మాచరించి కైకేయీహృదంబున దండకారణ్యా—

విశ్వా :—తల్లీ ! భూతద్రోహు లనేకు లుందురు. సర్వము నా కవగతమయినది. దశస్యందనుఁడు పుత్రేషణావ్యామోహబద్ధుఁడు. రామాగమనము దుర్ఘటముగా నుండును.

సరస్వతి :—ఉండదు. దశరథునకు రామస్వరూపము చూపించెద. కార్యవాది పరుల కష్టసుఖములఁ గనిపెట్టనెంచరాదు. మఱియు, దశరథప్రాణవియోగమునకు రాముఁడే కారణము. ఎప్పటికైనం దప్పనిదే. అయిన, నాభారము నామీఁద వదలివేయుము.

విశ్వా :—మేలుచేసితివి. పునర్దర్శన మాకాంక్షించుచున్నాను.

సరస్వతి :— అహల్యాసందర్శనసమయమున నీకోరికఁ దీరును.

విశ్వా :—అయోధ్యాప్రవేశము చేయుచున్నాను.

సరస్వతి :—ఇరువురము. (అని నిష్క్రమించును.)

విశ్వా :—కుణమునఁ తప్పిన నాతపము, నా బ్రహ్మత్వము, దగ్ధము కాఁదగనది. పరులచేఁ క్షమించుటయే పరమశ్రేయము. (క్రోధముతో) మారీచా ! నీ కాయువు మూడినది. (అని నిష్క్రమించును.)

సరస్వతి :—(తిరిగి ప్రవేశించి) కాలము సర్వకార్యములు చేయును. కాలపరిణామమునకు మున్ముర్తులు నిరీక్షించుచుందురు. ఆ పరిణామమే దురవగాహము భగవద్విలాసము దురూహ్యము ! చిత్రము ! రామావతారము లోకమున నెందరెందరికి నుపకారములు కావింపను న్నది ! ఎందరిని శాపవిముక్తులఁ జేయనున్నది ! నా ప్రతిన గట్టుపట్టు వచ్చు. పదివేలవత్సరములకుగదా, ఇట్టియూహ జనించుట కాస్పద మయినది. ఒక్కకార్యము సాధించుట కెంత కష్టపడవలయును !

సీ. ప్రతినఁబట్టఁగరాదు పట్టిన నెట్టులో
తిరుగక సాధించి తీరవలయు
మాటజారఁగరాదు నోటఁ జారినదాని
నిలుపఁగ యత్నంబు నెఱపవలయు
ప్రారంభ మొనరింప రాదు దేనినిగాని
యారంభ సంపూర్తి గోరవలయు
ప్రతిఘటింపఁగరాదు బలవంతులతోడ
ప్రతిఘటించి జయంబుఁ బడయవలయు

గీ. పురుషకారము జూపింపఁ బూనియున్న
వెనుకముందర యోజించి కనఁగవలయు
బుద్ధిబలమొండు గలిగినఁ బురుషకార
మూర దేనిని సాధించి తీరలేదు.

సర్వసాధన చిత్తైకాగ్రమున నున్నది. కాలపరిణామమున బుద్ధిశక్తిచే సాధింపరానిది లేదు. నేనిప్పుడు దశరథావనీశుసమీపమున కరిగి, పుత్రవియోగమునఁ దత్తరిపడుచున్న నాతనికి విశ్రాంతి నొసరించెద. (నిష్క్రమించును.)

## తృతీయరంగము.

విశ్వా:—(రాజమార్గమునఁ బ్రవేశము) (స్వగతము) భూలోక వైకుంఠము. "దేవతాపురిమయోధ్య" అని శ్రుతులు పలుకుచున్నవి. రామచంద్రా!

సీ. క్షీరశాయికి నీకు క్షీరంబులిచ్చిన
 పసుజాతి కేపుణ్య పదవి గలదొ
నిగమగోచర నిన్ను నిత్యంబు సేవించు
 తల్లిదండ్రుల కేమి దాచినావొ
పరమాత్మ నీమాట పాటల పఠియించు
 ధన్యుల కేమాయ దలఁచినావొ
పురుషోత్తమా నీదు పుణ్యులు సుగ్గులు
 గాంచుబంధుల కేమి యుంచినావొ

గీ. రామ నీనామ మొకమారు ప్రేమమీర
 పలుక సాయుజ్యమొసఁగెద వాఁడ విపుడు
సర్వకాలము నీపేరు సంస్మరించు
 సేవకాళికి నీవేమి సేయఁగలవొ

నేటికీ యిలాతలము సార్థకమయినది. (నాలుగువైపులలు చూచి) అప్పుడే రాజద్వారము చేరవచ్చితిని. ఫలవృక్షములుగల తోటలకు ముళ్ళకంప యావరణమైనట్లు రాజద్వారంబున కావలివారు మాబోటిబాటసారులకు కంటకప్రాయులు కాగలరు. రాజమందిరమును ప్రవేశించెద.

(నిష్క్రమించును.)

భటుడు:—(ప్రవేశించి) రాజద్వారములఁ గొలువుగొలుచుట కన్న వేరుపాతకములేదు. రేయుంబవళ్ళు కంటికి రెప్పలేక కాచుకొన వలయు. (అటుచూచి) అదుగో యెవరో కోపదారిమనిసిలాగుండాడు.

అప్పుడే పోతుండాడు. (చూచి) ఎవడో గొప్పమునిలాగుండాడు. ఎవ రండో! దోవయిట్లాగండీ! అది కోటదోవ. (అని లోపలికిబోవును.)

(దశరథుడు, సుమంత్రి, పరిచారకులు, విశ్వామిత్రుడు గూర్చుండియుందురు.)

దశర :— ఓ సంయమికల్పభూజా! మీప్రభావాతిశయంబున నారాజ్యకుటుంబము సురక్షితము. ఈ దశరథుం డరువదివేలవత్సరములు జీవించినందుకు సార్థకము నేటికి జేకూరినది. భవదాగమనకారణము వేడెద.

సీ. చేయునో చేయఁడో చెప్పదునా వల
దాయంచు శంక గాధేయ! మాను
నే విధేయుఁడ మీకు గావింపఁదగుకార్య
మేదియో వెలిపుచ్చి హితముగూర్చు
దశరథేశునిచెంతఁ దప్పిపోయెను యాచ్న
యను పరీవాద నన్నులమనీకు
మావంశ్యులందరు మానులకోర్కెలు
దీర్చువారలెయంచు దెలియుమీవు

గీ. పగుల నుపకారములు సేయఁ బాటుబడని
దేహములెకాని వ్యర్థంపు దిండిదినుచు
రాజసంబున సద్భోగ రాజిగుడిచి
మడియ రెన్నడు మావారు మానిచంద్ర

భవాదృశులకోరికలు లోకోపకారములుగాని స్వార్థాభిప్రాయపూరితములు కావు. మానులజీవనములు, ఋషివరుల సంచారములు, లోకరక్షణార్థమేగాని, స్వోపరయోగములు కావు. ప్రజారంజకమగు కార్యమాచరించని రాజు దారుగజమువలె రాజనామమాత్రుఁడుగాని రాజుగాడు. మహాత్మా! భవద్వాంఛితము తెలియజేయ వేడెద.

విశ్వా :—రాజా! నీ పట్టివాఁడవనియే యిక్కడికిరాక. నిజముగా మా కావశ్యకమగు కార్యములకంటె జగదపకారకుల నశింపఁ జేయుట మాపని. అది ప్రజలకును జేండ్లకును శుభదాయకము. మా యభ్యర్థితాంశము మాచే నెరవేర్పఁదగినదయినను కారణాంతరమున నిన్ను యాచించవలసివచ్చినది.

దశర :—సేవకుడుండఁగఁ ప్రభువేల నడుముకట్టవలె. అదియునుంగాక యుదారగుణులు పరులకుఁ గీర్తినాపాదించి తాము విలక్షణులుగా నుందురు.

విశ్వా :—మీకు మాయందుగలిగిన భక్తివిశ్వాసములు మమ్ము పెద్దజేయుచున్నవిగాని క్షత్రియసాధ్యమగుకార్యము పరమచ్ఛాందసులేమిసేయుదురు?

దశర :—తృణీకృతబ్రహ్మపురందరులగు మానుల కసాధ్యము బీదక్షత్రియులకు సాధ్యమా? కాదు. కాదు భవద్దయావల్లభ్యమగు కీర్తి యీ పేద కర్పించి తరింపఁజేయ దాము దయచేసినారు. క్షత్రియ సాధ్య మనుచున్నారు. ఆశ్రమములు దుష్టమృగాకీర్ణములా?

విశ్వా :—చక్కఁగాఁ గనిపెట్టినావు. మృగాకీర్ణముగాదు. మృగప్రాయాకీర్ణము.

దశర :—ప్రాయులన దస్యులా? దానవులా?

విశ్వా :—దస్యులగుదానవులు.

దశర :—అట్లయిన నిఁక నిశ్శేషీకృతదానవము భవదాశ్రమము.

విశ్వా :—సంశయమా? నీమనస్సంకల్పమే దుష్టనాశన శస్త్రము.

దశర :—సుమంతా? ఒక్క ప్రహరములోపల సేనలకు ప్రయాణ మాజ్ఞాపింపుము. సజ్జీకృతరథుండవై నీవును బయలు వెడలుము.

సుమం :—(వినయముతో) చిత్తము.

విశ్వా :—దశరథనందన! కొంచెము నిదానించుము. చెప్పవల సినయంశ మొకటికలదు, సానధానుడవు గమ్ము నీవేమి యీ కార్యము నకు ప్రయత్నింపనక్కరలేదు.

దశర :—మహాత్మా! అభిమానము లల్పులని తలంచవలదు. రాక్షసులు మాయావులుగదా ?

విశ్వా :—నిశ్చయమే నీ నీసభామండపమునుండి నేవకరయో నీకార్యము నెరవేరును

దశర :—అట్లయిన వారి స్వరూపమెట్టిది? వారేమి యపకృతి యొనర్చుచున్నారు?

విశ్వా :—మాయజ్ఞకార్యములకు విఘ్నము కలిగించుచున్నారు. మమ్ము బాధించుచున్నారు. నీవనినట్లు వారు మిగుల మాయావులు. అజేయులు.

దశర :—వారీపాటికే మీ యాగ్రహాగ్ని కింధనప్రాయులు కావలసినవారే. యాగములకే విఘాతమా? అంతబలవంతు లెవరై యుందురు?

విశ్వా :—తాటకాతనూజులు. మారీచ సుబాహులు.

దశర :—(విచారించును.)

విశ్వా :—విచారింపకుము. వారు మీకు లొంగనివారు కారు. ఆ యల్పబలుల నీటడంగింప నిన్ను మేము కోరింపము. రామలక్ష్మణులను నీ కుమారద్వయమును నాతో పంపిన కొలదికాలము లో నా మాయావుల మడియించి, సిద్ధము చేసి కళ్యాణమూర్తులై రాగిలరు. ఇందులకే మా రాక.

దశర :—(నిర్విణ్ణుడగును. పరిచారికలు వింజామరలతో విసర వలయును) (కొంచెము తెలివితో ప్రకటముగా) ఏమి! ఇది స్వప్నమా?

పిడుగుపడినదే. (కనులు తుడుచుకొని) స్వామీ! తాము నిజముగా గాధేయులా? గురువరా! మహర్షి యేమని వ్రాకుచ్చినాఁడు? రామలక్ష్మణుల మారీచసుబాహుల మడియింపఁ బంపవలయునా? (విశ్వామిత్రునితో) ఇదియేగదా కౌసికా! మీయాజ్ఞ. ఈ దశరథుడు సహించలేఁడు. మనలేఁడు. మన్నించుఁడు. దశరథుని నిశ్చయమిది.

సీ. చంద్రుని విడనాడి చంద్రిక వేఱుగా
నుండిన నొకవేళ నుండవచ్చు
వీతిహోత్రుని వీడి విడిగ వేడిమిపోయి,
యొకచోట నుండిన నుండవచ్చు
దీపాగ్రమును బాసి తేజంబు యొంటిగా
నిలిచిన నొకవేళ నిలువవచ్చు
శస్త్రంబులను బాసి శాతధారాశక్తి
పోయిన నొకమారు పోవవచ్చు
సూర్యుఁడొకవేళఁ జీకటిఁ జూడవచ్చు
భూమిఁ జంద్రుఁడు పుట్టినఁ బుట్టవచ్చు
పిడుగులొకమారు చల్లనై పడగవచ్చు
రాముఁ నెడఁబాసి యీతఁడు బ్రతుకలేఁడు.

(పాదములు పట్టుకొని) స్వామి! యీదశరథుఁడు అన్యాయనాఁడి. కుటిలమార్గవర్తి. పాపరూపుఁడు. పుత్రస్నేహవివశీకృతస్వాంతుఁడు. అపరాధి. న్యాయముగా కృతనాపహాయుడనై చనుదెంచువాడను. భవదాజ్ఞానువర్తినై మనుజభాదులం దునుమాడెద. లేనిచో దేవరవారిచరణముల కీ శరీరము బలిదాన మొసంగెద. తమయాజ్ఞానుసార మీతేఁడు రాఁగలఁడు. తమకోరిక నెరవేర్పగలఁడు.

విశ్వా:—రాజా! భయపడకు. మానులు లోకులశుభము కోరుదురుగాని కీడుగోరరు. ఇది నీకు తెలియనిదికాదు. పుత్రవాత్సల్యము

నిన్నస్వాస్థ్యచిత్తునిఁ జేయుచున్నది. ఎంతవిరికిపడితివి. కార్యాపేక్షకలిగిన నే ననమర్థులఁగోరి దీసికొనిపోయి విఫలమనోరథుండ నగుదునా? పుత్రేషణ బలాత్కారముగా నిన్నసత్యాగాధకూపంబునఁ బడఁద్రోచినదే.

దశర :—తమయూహాలు, అలౌకికములు, దివ్యములు. "ప్రమాదో ధీమతామపి" నాకుమారులు శూరులు కావచ్చు. శత్రువులు దుర్ధరులు. దుర్గములు. దయఁజూపుడు. మీకార్యమునకు మీలెంకలలెంకరాగలండు. నెరవేర్పఁగలఁడు. మన్నించుడు.

విశ్వా :—దానవులు యువకులు. నిస్సత్వీకృతదేవతాగణులుఁ మాయావులు. దుస్తేజులు. అజేయులు. మఱియు నొకవిశేషము. కలఁడుగదా! త్రిలోకకంటకుఁడగు రావణుఁడు బాహాబలోచ్చాలితకైలాసాచలుఁడు

దశర :—(ఆతురతతో గుండెలు తడువుకొనవలయును)

విశ్వా :—ధీరుఁడవుకమ్ము. ఆదుర్మార్గునకు వీరుముఖ్యసేనానాయకులు. అసంఖ్యాతములగు సేనాసముదాయము కలవారు. నీవు పెద్దవాడవు. అగునదివే యేండ్లు గతించినవి. ఈ యుద్ధమున నీకుమారులు ఖ్యాతిగాంచినట్లు, నీవు కీర్తిఁగాంచలేవు. భావిశుభములు క్కలు నీకుమారుల కందఁజేయఁగోరి చక్కఁగ యోజచేసి నీచెంతకు వచ్చినాను. కాదనక మామాట విశ్వసించి అర్థినార్థి మొనఁగుము. స్వస్థచిత్తుఁడవై పరికించుకొనుము.

దశర :—మహాత్మా! మీవంటి సత్పురుషులతో సనృతంబులాడిన మహాపాతక ప్రాయశ్చిత్తార్థ మాకల్పాంతనరకకూపావాసదుఃఖముల సహింతునుగాని చేచేత నీకఠినకార్యమును చేయఁజాలను.

సీ. దిరిసెనపుష్పమ్ముఁ దలిసి యగ్గిలోవైచి
మలమలమాడ్చెడు ఖలుఁడుగలఁడె

రామచిల్కనుబెంచి ప్రేమ మూలకుద్రోచి
పిల్లినోటనుబెట్టు వెఱ్ఱిగలఁడె
పూలమొక్కలఁబెంచి పూచుచుండెడివేళ
గొడ్డంటనరుకు మూర్ఖుండుగలఁడె
బంగారుబొమ్మల శృంగారమునుచేసి
నట్టేటద్రొక్కను చెట్టగలఁడె

గీ. యనుభవించగ సిద్ధమై యలరుఫలము
లకట యనుభవింపగనీక యడ్డువచ్చి
మట్టిగొట్టితొ నానోట మౌనిచంద్ర
శరణుచేసెద పుత్రభి క్షమ్ముపెట్టు.

(విసువుతో) వినలేదు, వినలేదు దయామయా! దశరథు డేచావుచచ్చునో, యన్నృతమాడినాడు.

విశ్వా:— ఛీ దుర్మార్గా! యెంతమాటాడితివి? నిజముగా నీవు పుత్రవియోగమునచే మృతిబొందెదవు. (అని వెళ్ళబోవును.)

దశర:—(విశ్వామిత్రుని పాదములను కౌగలించుకొని) దశరథుఁడు శిరోర్ధ్వుఁడై శపించుడు. తండ్రీ! మహాత్మా! శ్రీరామవియోగంబు సహించి మనఁజాలఁడు కరుణించుడు. కడుపుచీల్చి యొట్టి యకృత్యమైనఁ జేయించును. ఎంతహీనతక్కైన లోఁబడఁజేయును. దయామయా! మీరేమైన ననుకొనుడు. యొట్టికఠినశిక్షయైన నొసంగుడు. (అని నమస్కరించును.)

విశ్వా:—(స్వగతము) ఎంతపిచ్చివాడు! పాపము! పుత్రేషణ మునిగినాఁడు వివశుడైపోయినాడు. వీనిశపించి చేయఁదగినదేమి? మంచితనమునఁ గార్యము నెరవేర్చుకొనవలయు. (ప్రకటముగా) లెమ్ము. నీవలె మేము తొందరనొందఁగూడదు. నీ కొకరహస్యము చెప్పెదను. శ్రద్ధాళుఁడవగుము. (అని లేవదీయును.)

దశర :—(లేవక బిగిసిపోవును.)

విశ్వా :—(ఆశ్చర్యముతో) దుఃఖాభిభూతుఁడయినాఁడు. విగతప్రాణుఁడా?

దశర :—(కలవరించుట) తల్లీ! యపరాధము. నిజముగా నాకుఁ దెలియదు.

విశ్వా :—(యోజించి) ఈతల్లి యెవరు? తెలియని దేమిటి? ఉన్మాదము కాదుగదా?

దశర :—(గద్గదస్వరముతో) చూచుచున్నాను. తెలిసినది. నిశ్చయమె. పంపెదను.

విశ్వా :—ఓయి, దశస్యందనా? నామాటవినుము.

దశర :—(లేచి బెదరుచూపులతో) ఈదశరథుఁడు నిక్కముగా బ్రతికియున్నాఁడా? పరలోకవాసి యయినాఁడా? జాగ్రదావస్థయా? ఇది స్వప్నప్రపంచమా? నిశ్చయముగా నింద్రజాలములో మునిఁగినాఁడు. స్వామీ యిదియంతయు మీ తపఃప్రభావము.

విశ్వా :—ధైర్య మవలంబింపుము. నీ యభిప్రాయమేమి?

దశర :— ఏమియున్నది! పదునారము పదునైదువత్సరములైనను నిండలేదు. లక్ష్యముచూచి శరమోక్షము గావింపలేరు

విశ్వా :—నీవు స్నేహవివశీకృతుఁడవయినావు. లాతిమాటలు విని యోచించవు. పైపెచ్చు యిమ్ముల తెలివిహీనులలోఁ జేర్చినావు. ఇప్పుడు నీవు తెలిసినదంటివే, యేమి తెలిసినది? నావచ్చినపనికి యుత్తరమేమి?

దశర :—మీ శాసన మనుల్లంఘ్యము. చతురంగపృతనాసమేతుఁడనై మఖసంరక్షణార్థ మరుదెంచెద. నావెంట నాకులబలం దీసికొని వచ్చెద.

విశ్వా :—ఓయి! నిరాదరీకృతిగా దేమిశాసనా! నీవు మాకక్కఱలేదు. నీకుమారులు రామలక్ష్మణులు మాకార్యముల పరిపూర్తి

గానింతురు. నీవు శుద్ధమూర్ఖుండవు. ఇప్పుడు నీకనులంజూచినదంతయు గ్రహించలేవు.

సీ. రాజీవనేత్రుండు రాముండై జనియించె
    సౌమిత్రి శేషుండే జన్మమందె
శంఖచక్రంబులు శత్రుఘ్నభరతులై
    నీగర్భమునబుట్టె నిక-మిదియ
దేవతల్వానులు గావించి ప్రార్థన
    భూభారమునుమాన్ప మ్రొక్కులిడఁగ
దానవాళినిఁజంపి ధర్మసంస్థాపన
    సలుపంగ విష్ణుండు జగతిమీద
గీ. బుట్టినారయ్య నీయందు పుత్రులనుచు
ప్రాకృతులుగాను దశరథ భయముపడక
సోకుమూకలు రణభూమి చచ్చుచున్న
క్షణములోపలఁ బరిమార్ప శక్తుఁడతఁడు

రాజా! నీయింట మద్గుముకీపెములు చూపించుచుఁ గూర్చుం ముకాలము గీపోయినది. ఇంక పరమేశ్వరుండు వచ్చినకార్యము చేయ బయలువెడలవలె. ఎన్నియో నాటకములు ప్రహసనములు ప్రయోగములు సలిపి వాచామగోచరుఁడగు మహావిష్ణుని భూలోకమున, అవతరింప జేసితిని మాకార్యములు మేము చేసికొనఁగూడదా? నీముందల నిమిత్తమాత్రమే. ఇప్పుడు నీవు చూచినది నీపుత్రుని పూర్వరూపమే నీకు దర్శనమిచ్చినది శారద. తెలిసినదియా? ఇంక మారుమాటాడక, రామలక్ష్మణుల మావెంటఁ బంపుము.

దశర:—(సంతోషముతో నమస్కరించి) మహాత్మా! ధన్యుడనైతిని. సర్వము కరతలామలకమయినది. భవద్వాగమృతరసాయన సేవామూలమున బుద్ధిజాడ్యోన్మాదము తొలఁగిపోయినది. తెలియక మిమ్మాడిన నిష్ఠురోక్తులను బాలవాక్యములుగా భావింపవలయును.

సీ. పాముగాఁబైఁబడి భయపెట్టు మీనుడి
మానిచంద్రదమ పద్మ మాలయయ్యె
దావాగ్నికీలయై దహియించి మీమాట
శాపాసి చందన చర్చయయ్యె
త్యేలోపమానమై చెవిసోకి మీయాజ్ఞ
సుశ్లోక యమృతంపు సోనయయ్యె
శల్యమై బాధించి స్వాంతమ్ము మీకోర్కె
గాధేయ హిమరోచి కళికయయ్యె

గీ. గాధినందన మీపలుకు గాజురాయి
యనుచు మదినెంచి వజ్రంపు తునకయనుచు
తెలిసికొంటిని యిప్పుడు తెలివిగలిగి
తప్పుగలిపితి క్షమియింపు తాపసేంద్ర.

సేనకా! రామలక్ష్మణులను తీసికొనిరమ్ము. మహాత్మా! నా పుత్రులు సేయఁదగిన పనియేమి? రాక్షసాధములవలన దమకుం గలుగుకష్టములెవ్వి?

విశ్వా:—యాగవిఘ్నములు. సమాధివినాశములు.

దశర:—అంత భ్యాసితాధర్వణులగు బాలకులు దత్తులఁ బాపఁగలరా?

విశ్వా:—వారికి గానలను గదిరములు మేము సమకూర్చెదము.

రాముడు-లక్ష్మణుడు:—(యిరువురు ధనుష్పాణులయి ప్రవేశించి, తండ్రికిని విశ్వామిత్రులకు నమస్కరింపవలయును.)

దశర:—నాయనలారా! రండు (అని చేరతీసికొని సింహాసనముపై కూర్చుండఁబెట్టవలయును.) రామా! మునిచంద్రునిఁ జూచితివా? వారికి మీరిరువురు శుశ్రూషణమొనర్పవలయు. జాగరూకతతోఁ జేసెదరా?

రాము :—పితృ ఆదేశము ననుసరించి.

లక్ష్మ :—మునిజనసేవకన్నఁ జేయఁదగుకార్యమేమి కలదు ?

దశర :—కుమారా ! దారుణమగు ప్రవిదారణము సల్ప వలయు.

లక్ష్మ :—శాపాయుధులచెంతను విజయము భ్రాతృపాదులకు సిద్ధాంతమే.

రాము :—భవన్మంగళాచరణ మహిమావిశేషమున జయము గైకొనియెదను.

విశ్వా :—రాజా ! పోయివత్తునా ?

దశర :—సేనాసముదాయములు సిద్ధమయినవి. ప్రయాణము గావించెదను.

విశ్వా :—అక్కర లేదు. నీకుమారద్వయము జగత్త్రయము తృణప్రాయముగా జయింపఁగలదు, నీవు భయపడకుము. ఈమన్మాత్రము శస్త్రఘాతములేక, అలయిక నొందింపక, పువ్వులలోనుంచి నీ కుమార యుగ్మము నీకుసమర్పించెద.

రాము :—తండ్రీ ! ఋషీశ్వరుల యానతియే సర్వసైన్యములు.

లక్ష్మ :—అన్నగారు ధనుష్పాణులయిన పృతనాసహాయము కావలయునా ?

దశర :—ప్రతియోధులూ శరాగ్రేసరులు.

లక్ష్మ :—అట్లయిన రామశరాగ్రములకు తూలప్రాయులు.

రాము :—శాపాయుధుల వాక్యములకన్న శరాఘాతము లెక్కడా ?

దశర :— మహాత్మా ! మా చారులం బంపెదను. దినదినము వీరిక్షేమోదంతము తెలియఁజేయవేడెద. తండ్రులారా ! పోయివత్తురా ? (రామలక్ష్మణులు నమస్కరింపవలయును.) శత్రువుల జయించిరండు.

విశ్వా :—కళ్యాణోపేతులయి రాగలరు. రాజా ! నీవు చారుల నంప నవసరములేదు. వీరిక్షేమసమేతవిజయవార్తలు లోకమువలనఁ

ప్రతిదినము వినఁగలవు. నిలువుము. (రామలక్ష్మణులవైపు తిరిగి) నాయనలారా! రండు. (విశ్వామిత్రునకు రామలక్ష్మణులు (నిష్క్రమింతురు)

దశర:—(వారువెళ్ళినవైపుచూచుచు) అదుగో! బహిర్ద్వారము దాఁటినారు. సుమంతా! అపూర్వమొక్కటి గాంచితిని.

మంత్రి:—మహారాజా! యేమది?

దశర:—అనిర్వచనీయము,

సీ. దివ్యమై, భవ్యమై తేజస్స్వరూపమై
కమనీయమై, ముందు గానఁబడియె
భీమమై తీక్ష్ణమై భీతిదాయకమౌచు
క్రోధస్వరూపమై బాధయొసఁగె
మందమై, మాన్యమై మందహాసమునర్చి
శాంతస్వరూపమై శాంతిగొలుపె
రామమై నయనాభి రామమై వీణాబ్జ
పాణియై శాసింప రాణియయ్యె

గీ. తనువు వడిఁకాఁడె, బుద్ధియు దభ్రమయ్యె
కంపమందెను దేహంబు తెంపుగలిగె
ధైర్యమెట్టులొ తలయెత్తె తరుణిమిన్న
మేను స్పృశియించి మంత్రించ మౌనకలత.

అది స్మరణకు వచ్చుటచే దిరుగఁబలుకలేకున్నాను. విశ్రాంతి వహించవలె.

మంత్రి:—చిత్తము. దౌవారికా! మహారాజులు-శుద్ధాంత మార్గము!

సేవకు:—బుద్ధి. ముదల, మహారాజశేఖరా! యనఘారు-పరాక్. త్రోవయినది.

దశర:—(మంత్రిసహితముగా నిష్క్రమించును.)

షష్ఠాంకము సమాప్తము.

---

# అహల్య.

## సప్తమాంకము.

### ప్రథమరంగము

గౌతమాశ్రమప్రాంతము – (బండగానున్న యహల్య, రాముఁడు, లక్ష్మణుఁడు, విశ్వామిత్రుఁడు, గౌతముఁడు, శతానందుఁడు ఋషికుమారులు ప్రవేశింతురు.)

గౌత :—(ముందుగా ప్రవేశము, స్వగతము) పరిచితప్రదేశములయినను చిరకాలవియోగముచేత క్రొత్తవై గనుపట్టుటయేకాక, మనోవిభ్రాంతి గొలుపుచున్నవి. (ఒకచెట్టును సమీపించి)

సీ. లేతమొక్కవుగదా గౌతమాంగన నిన్ను
బెంచునప్పుడు మఱ్ఱి పెద్దవైతె
నింబమా నినుదెచ్చి నీరువోసియు బ్రోదిసేయు కుఱ్ఱనిజ్ఞప్తి చేసికొనుదె
పుష్పవృక్షంబులఁ బాలుపారుదో క్షమ
కుశకుంజములతోడ గూడినావె
పెంపుడులేడుల గుంపులుండెడి తిప్ప
తోడేళ్ళగమితోడ గూడినావె

గీ. పావకుండు వసించు నా పర్ణశాల
పాముపుట్టలు పెట్టెన్నా పద్మభవుఁడ
కాలమేరీతిఁ దిరుగునో వీలులేదు.
తెలియఁ జిత్రముగా నుండు కలనుఁబోలి.

ఎన్నివత్సరముల కీ ప్రదేశము ద్రొక్కితిని! (పరికించి చూచి) ఈప్రదేశమున వెదురుగుబురొకటి క్రొత్తగా మొలచినది. నూతనముగా ననేకములు పుట్టుచుండునుగదా. (అని దానిచుట్టుఁ దిరుగుచుండును.)

రాము :—(చాటుగానుండి చూచుచుండవలయు.)

లక్ష్మ :—సోదరా! వెదురుపొదను చూచుచుంటిరా?

విశ్వా :—(స్వగతము) శారద వచ్చుచున్నది. (ప్రకటముగా) లక్ష్మణా! యేమనుచున్నావు? ఇది యిప్పుడు మహారణ్యమైయున్నది.

రాము :—మహాత్మా! చిరకాలముక్రిందట సిక్కడ పుణ్యపురుషులు సంచరించి యుండవలయును. ఏమందురా? ఈప్రదేశము త్రొక్కినదిమొదలు, చిత్తము కర్మనిష్ఠ నవలంబించినది. మన యధ్వర్యుఁడుగారుగూడ నేలకో విభ్రాంతి నొందినాఁడు. ఏమేమో పరిశీలించుచున్నాఁడు.

శతానం :—లీలామానుషవిగ్రహుండవగు నీవెఱుంగని విషయము గలదా?

విశ్వా :—నీవు చక్కఁగాఁ గనిపెట్టితివి. ఈయాశ్రమము, మున్ను మన గౌతములవారిదే. మన యజ్ఞసమయమున జరిగిన గృహస్థాశ్రమచర్చ యీవిషయమే. కారణాంతరమున, దీనికి నపూజ్యత లెటస్థించినది. నీవలనఁ దిరుగ పూజ్యతకలది కావలయు. వృత్తాంతమంతయుఁ గ్రమముగాఁ దెల్లపడగలదు.

రాము :— మహాత్ముల వాక్యములు సార్థకములు. గంభీరములు.

విశ్వా :— గౌతమా! ఆశ్రమసందర్శనమున చిత్తవైకల్యము నొంది కర్తవ్యాంశమును మరచినాఁడవు. చరిత్రాంశము జ్ఞాపకము చేసికొనుము.

రాము :—తాతగారు వెదురుపొదనేలఁ జుట్టుచున్నారు? (అని సమీపించి మనుష్యాకృతిగానున్న బండనుచూచి) తమ్ముఁడా! యీపాషాణమునుఁ జూచితివా? (అని కాలితోఁ దన్ని చూపించవలయును.)

అహల్య :—(రాయిమారిపోవును) రాములవారిమీఁద పుష్ప వర్షము కురియును.

సరస్వతి :—(ప్రవేశించును.) (అందరు నమస్కరించవలయును)

శచి :—(ఇంద్రునితో ప్రవేశించును) ఇంద్రుఁడు సిగ్గుతో నుండవలయును.

అహల్య :—(సరస్వతి దగ్గరగాఁబోయి) రామునిస్తవము చేయును.

సీ. సకలలోకారాధ్య సర్వేశజగదీశ
భక్తపాలనదయా పర యనంత
యోగిమానసనిదాన యోగరూపశరీర
యమరలోకస్తుత్య యమితతేజ
నాగారివాహన నాగారిఖండన
నగవైరిసోదర నాగశయన
వైకుంఠనిజధామ వందితాఖిలసామ
భక్తపూరణకామ భవ్యనామ

గీ. క్రూరరాక్షస, నాశంబు కొరకు భూమి
మీఁద నవతరించినమహా మీనకూర్మ
కిటి హరి మొదలుగాఁగల కీర్తనీయ
రూపములఁదాల్చి వెలయు చిద్రూపుఁగంటి.

నేఁడు రావణవధార్థమై మనుజరూపధారివై సూర్యవంశమును పవిత్రంబుగావించి, యానుషంగికంబుగా మహాపాపప్రాపిత పాషాణ రూపమునుండి నన్నుద్ధరించిన మహామహునకు సాష్టాంగ మాచరించు చున్నదాన.

(అని నమస్కరించవలయును.)

రాము :—(ఆశ్చర్యముతో) ఏమిది ! మహాత్మా !

విశ్వా :—సర్వము నీకుఁ దెలియును, క్షణము నిరీక్షించుము.

గౌత :—మహాత్మా ! నన్నొక యింటివానిని గావించి కృత కృత్యుని గావించితివి.

శర :—రామా ! నీవు ప్రకృతము మనుష్యరూపము వహించి నను, లోకగురుఁడవు. నీయవతారము శరణాగతరక్షణార్థమై యరుదెంచినది. మహేంద్రుని మోసగృత్యమున నాపుత్రిక పాంసులయైనది. భర్తృశాపవశమున పాషాణయై, చండాతపవాతశీతబాధల కోర్చి పునర్జీవితయై నీపాదపరాగలేశంబున పవిత్రురాలుగాఁ జేయఁబడినది. కావున నాప్రార్థన మంగీకరించి యీయహల్యను యపాంసులగా గణింపఁజేయవలయు.

బ్రహ్మ :—(ప్రవేశము) చేయవచ్చు. ఇది నూతనజన్మ, పరస్వతీజపంబు సిద్ధివహించినది. పతివ్రతలలోఁ బరిగణింపవచ్చు.

(బ్రహ్మకు రాముఁడు మొదలగువారు నమస్కరింపవలయు.)

శచి :—(వినయముతో) మహాత్మా ! నీకుమార్తె దురవస్థ తీరినది. ఆనందసమయము. ఈ దేవేంద్రునిదుస్థితి చాలగించ నీ పులోమజ మొర వినవలయు. రామా ! దీనుల సంరక్షించుభారము నీయది.

బ్రహ్మ :—గౌతమునివాక్య మమోఘము. వానియనుగ్రహము సంపాదింపుము.

శచి :—ఋషిచంద్రమా ! నూతనగృహస్థాశ్రమ స్వీకరణసమయమున శచీపునోభీష్టము నెరవేర్చవేడుచున్నాడ.

రాము :—దేవేంద్రా ! ఋషులు పరమశాంతులు. నీప్రార్థన నన్యథాసేయరు.

గౌత :—సర్వము నీదివ్యమాయావిలాసము. మహేంద్రా ! క్షమించితిమి. నీశరీరము చూపరులకు నయనరూపములుగాఁ గనుపించును. సహస్రాక్షనామము వహించుము. దేవతలందరు నిన్ను ముఖ్యవంతునిగా బస్తాసహాయంబునఁ జేయుదురుగాత !

విశ్వా :—బ్రాహ్మణపత్నీసమాగమనదోషంబు మరువక సుఖంబుగా నుండుము.

సర :—నాథా! పతివ్రతగణనీయయేగదా అహల్య?

బ్రహ్మ :—ఇప్పటిజన్మత్రయం దణుమాత్రము నందియములేదు.

సర :—అహల్యారూపమున కనుమానములేదు.

బ్రహ్మ :—శారదా! నీవే గెలిచితివి. ఎప్పటికి ప్రకృతియే గెలుచును.

రాము :—జగదాధారము.

సర :—నీసన్నిధానమువలన సర్వశక్తులు కలుగును.

విశ్వా :—నడువవలసిన ప్రయాణము చాలగలదు.

రాము :—మీయనుగ్రహమున దేవతాదర్శనము, శారదా విధాతృల సందర్శనము లభించినది. కృతార్థుడనయితిని.

బ్రహ్మ :—మహాత్మా! కృతార్థులను చేసినావు.

గౌత :—నా యింటికి విందనయితివి.

అహల్య :—మా యాతిథ్య మంగీకరింపవలయు.

బ్రహ్మ :—అందరము సంసిద్ధులము. రామపాదపంక్తి దొరుకుట దుర్లభము. మహేంద్రా! అహల్యా! మీరిరువురు దోషరహితులయితిరి.

ఇంద్రు :—సీ. పరకాంతలనుగూడ పరువెట్టువారలు
దేవేంద్రుకష్టాలఁ దెలిసికొనుడు

అహ :— అన్యపురుషుల నభ్యర్థించు తరుణులు
గౌతమార్ధాంగిని గనుఁడుమదిని

బ్రహ్మ :—సౌందర్యవతులైన సాధ్వులకష్టాలు
తొలగ విఖ్యాతిని మెలగుగాక

సర :—భర్తతో పంతంబు పలుకనెంచినవారు
శారదస్మరణను సలుపరమ్మ

గౌత :—కోపమెంతటి శాంతుని గూడుకొనిన
విశ్వా :—పాడుసేయును వానిని పతితునిగను
శతా :—కాలమహిమంబు చిత్రంబు కాదె ఇపుడు
రాము :—సర్వసుఖముల జేకూర్చ శక్తిగలదు.

గౌత :—ఇటు దయచేయుడు.

రాము :—తథాస్తు.

సప్తమాంకము సమాప్తము.

అహల్యానాటకము సర్వము సంపూర్ణము.



# అహల్యా సాంగ్సు.

ఈసాంగ్సు యాక్టర్లు సందర్భానుసారంగా తీసుకొని పాడుకోవలెను.

ప్రార్థన (నాటకారంభమున)

కళ్యాణి - ధ్రుపద్ - 6 మాత్రలుతాళము.

శ్రీసీతారామచంద్ర - స్థిరతర సత్కీర్తిసాంద్ర ॥శ్రీ॥
భాసమాన రఘువంశచంద్ర - భవ్యకరుణానిస్సంద్ర ॥శ్రీ॥
కమలపత్ర సదృశనేత్ర - కమనీయ పయోదగాత్ర
అమరలోక వైరి సముద - యాటవి పటువీతిహోత్ర
రమణీయచారిత్ర సం - రక్షిత విశ్వామిత్రా
క్షమాదిగుణరత్న భరణ - సరోజమృదుతరచరణా ॥శ్రీ॥

— "శచి" బిలహరి—దాద్రా

నాతగమె నీవి - లాసమెన్నగా సత్యంబుగ
అరయగ త్రిభువనదుర్లభ - మెయులగున్ ॥నా॥
ఈనిఖిలామరసామ్రా - జ్యానుభవంబునకు యోగ్య
మైనది నీ దివ్యరూప - మగ్గ్వరాలుగా దీశచి
మానుగ ఖీారీచింతా - మణిసింహాసనమున నా
సీను లైన మీావాసుల - మానందించెదము ॥నా॥

"ఇం ద్రుడు - అహల్యా"

జెలాగ్, బీన్‌పలాస్ - త్రితాల్ (నఠభైరవిమేళం)

ఇటుతగునా యోచానా నీ-కిటుతగునా దాసుడగానా కిన్నబూనకుమా నాపై నీ ॥కిటు॥

సన్ను తాంగిరో నాపెన్నిధివటంచు నే - సేవింతున్ నిన్ స్మరియింతున్
గ్రన్నన నను కరుణగాంచకున్న పృధివిన్ - చిన్నెలాడినిం కెట్లుజీవింతున్ ॥యిటు॥

సమస్తధర్మము లెరింగితివి నీచకార్య - మొనరింప న్యాయమా
అమరాధీశ్వర చనుమా శ్రేయముగనుమా - యేటికి విడుమా
మూర్ఖత ॥యిటు॥

"అహల్య - ఇంద్రుడు" డైలాగ్ - కమాస్ - దాద్రా.

ఔర దురితచరిత ఇదినీకు - న్యాయమా శ్రేయమా సహాయమా ఛీఛీ!
ఓరి క్రూర కారు లరివనేలరా నీవీరీతిని
పరమసాధ్వీగౌర నికన్ ధరను - మనక గన్‌దలతువే చనుము చనుము
ఛీఛీఛీ!

"ఇంద్రుడు"

నెలతమనోహరంబైన నీమృదుదేహముబేలా తలపక కష్టములపాలే
యగనేలా నాపలుకు వినుము - భద్రముననుము కలకాలము సుఖ
పడుము.

"అహల్య"

వలదువలదు నీ వాంఛవిడుము నీ నైధనంబు నీ బాహుబలము నిష్ఫ
లమవైతువా బ్రతుకదలపవా ॥ఔ॥

"అహల్య" హరికాంభోజి మేళం - చతురశ్రము.

ఛీఛీ పోపో తులువా పలువా - చెరంపలంచితివి చెప్పితిసత్యముగ
నీచుండవై నను బలాత్కరింప - యోచించుచుంటి విప్పు డీపగిది
పదుగురకును బుద్ధిగరపజాలు - వారే వే నీ వినాశమునకే నీకిటుల
దుర్బుద్ధిజనించెను ॥ఛీ ఛీ॥
నీకిది తగునటరా నీచాత్మ - నిలువున భస్మముగావటరా నన్
దాకిన నిప్పుడె వేయివక్కలై - ధరపైబడు నీశిరము దురాత్మా!
మానుమురా నీబుద్ధి మానకున్నచో ని - మేషమున నిజంబు భ్రష్టుం
డవౌదు ॥ఛీ॥

"అహల్య" (టపా) (జిలా) ఖరహరప్రియమేళము - దాద్రా.

(పల్లవి, అనుపల్లవి టపామాదిరిగా పాడుకొనవలయును. చరణమున తాళముండును.)

కీని కేమికారణమోగదా ॥దీ॥
దివ్యసృష్టియంతయున్ ॥దీ॥
తెలతెల వారెడువరకె చిత్రించినట్లు కనపడు
ఫలములు సుమగుచ్ఛంబులు - పత్రంబులు నలరారున్
బళిబళి యింపుగులుకున్ దలపోయన్ దోషకుండె ॥దీ॥

"శచి" తోడి - దాద్రా

ఆహా నానాథుని కామాగ్ని యెట్లుచల్లారునో - హా మాటాయె విన డయ్యెన్
ఎంతవక్కాణించినన్ మరి - యెంత ప్రార్థించినన్ తానింత వినడిల్లను ముందేమి కానున్నదో ॥ఆ॥
ఏ యాపదనైనను యేనంచనన్నైనను మఱి - యేయువిధేయతగన్ గొన నీయడు మేలుసేయడు ఆశబాయుడు కామ ॥మాహా॥

"శచి" అసావేరి - త్రితాళ్

గాథా యిదితగునా - శుభమానా ॥నా॥
సాధుపుంగవుడవు - పదములచిత్తుడవు ॥నా॥
ఆరయధర్మాధర్మములెరిగిన - మీరే యిటులన్య
కామినులగోరినచో నిక కే యితరుల బేరుకొసగనేలా గుణజా ॥నా॥

జైలాన్ "ఇంద్రుడు-శచి" కమాచ్ - చతురశ్రము

చనుము చనుము ఛీఛీ కుమతి-చనువులుసాగవు చయ్యన నిటనుండి॥చ॥
కనులుగానవా ? ఒడలు తెలియవా ? -కాంతుడనుకొనవా ? గర్వించితివా ? ॥చ॥
ఏలా రౌద్రాకృతి బూనగమేలా సాధ్వినిగోరగ గుణజాలా॥

"ఇంద్రుడు - త్రిశ్రము."

చాలింపు నీవెర్రివేదాంతమింక
మేలుమేలు తెల్లమయ్యె మిన్నకున్నకొలదియు ప్రేలకొచ్చితివి యేమొ పెద్దభూతమట్టు ఛీఛీ॥

"గౌతముఁడు" - హిండోల్ - త్రితాల్

కారణమేమోగాని దినదినము - మారుచు నున్నది మగువవర్తనము
వారిజాక్షి మున్నటివిధమున నుపచారముల బూర్ణశ్రద్ధవహింపదు ॥కా॥
అనలము నూదుటనున్న - అట్లుసేయదు సమిధల నిడుమనిన నాలస్య
మొనరించును పాల్గిసివెంచియున్ - జని క్షీరంబుల బితుకజూచి మర
లును పదిమార్గులు బిలచిన పిమ్మట - వినలేదు మరలజెప్పుడనిపల్కు-
వనిత యొక్క-పనిని జేయుమన నొక - పనినిజేయు దీనికంతకున్ ॥గార॥

"అహల్య" (టపా)

అకటా నిరర్థకమయ్యెగా - నాజన్మ ॥యకటా॥
అకలుషపతివ్రతాత్వము నిప్పుడు నిప్పుల - పా
లయ్యెను దుష్కా-రము - కుమ్మరి - సా - రెకుమార్గె తిరుగుచునుం
డెన్ నాకెటుల దోపకుండె ॥యకటా॥

"గౌతముడు" సురట - చతురశ్రము

ఛీఛీ మానులుసేయునదేమనియెంచి దుష్కృత్యమొనరించెదవా ॥ఛీ॥
ఓమందూశస్వర దర్వీకర - యోయధమాధమ యోమూఢాత్మా
యీమునిమహిమం బెట్టిదొ యెరిగెద-విప్పుడె సర్వముకాచు కొను ము॥ఛీ॥
వినవా గౌతమమునియేకోపిం - చిన జగములు భస్మంబులుగావా
కనవా కన్నులు సాధ్వీమానం-బును గైకొని కొంపలుగూల్చెదవా
అనువారెదు నీగౌరవమును నీ - యౌన్నత్యము నిప్పుల వైచితివా
చెనటీ సిగ్గయిననులేదా యేమని కొక్కరుకోయని యరచితి ॥ఛీ॥

డైలాగ్ - "ఇంద్రుడు - గౌతముడు - శచి" - గౌళ - త్రితాల్

శరణు శరణు నను రక్షింపుమా నిరత
కరుణామృత కిరణానత శరణానుత-చరణాహత దురిత శుభచరిత ॥శ॥
పరమపాపాత్ముడను మీమహిమను
పరికింపక యపరాధమొనర్చిన
కరుణజూచి నను నెట్లయినను
గావవేడుచున్నవాడన్ మిగుల

"గౌతముడు"

ఏమి నక్క-వినయము క్రిందనగ్ని నిడి పైనుదకము జల్లుదువా

"శచి" - త్రిశ్రము

ఓ మునీశ్వర పతిభిక్ష నొసగి నన్ను బ్రోవుమా
హా మీరలె గాకున్న అన్యులెవరి వేడుదున్

"గౌతముడు" - చతురశ్రగతి

అనార్యురాలా అభాగ్యురాలా అహల్యనీవంటి యాడుదిగాదా
కనంబడు తత్ఫలంబు సర్వము - క్షణం బోపు కొనుడింకన్ ॥శర॥

"గౌతముడు" (మధ్యమావతి) సారంగ - త్రితాల్.

ఈగౌతముం డెంతటివాడో సమస్తలో - కము దెలియుతన్ వేగముగా
నిపుడే॥ ఏకాంతసౌందర్యమున జగములు-నెట్టిదాలేకుండ నొనరించెద
నిక - నేది యెటులయినను సగునుగాక హా ॥యీగౌ॥
వనితామాణి నా మాటింభం బొనర్చెదను స్త్రీసృష్టియంతయున్
క్షణంబుననె యడుగంటజేసెదన్ ఫలంబుదల్చెద ॥యీగౌ॥

"సరస్వతి" జంఝూటి - త్రితాల్.

మునికులేంద్ర క్షమింపుమా కలికికి శాపమొసగితివి - నీవాక్యంబమోఘ
మె - యొకటగుగాన - తప్పబోదిక - నెనగాని ॥ముని॥

త్రిశ్రగతి.

నారాయుండవై - భూభారంబును బాపుటకై - శ్రీరాముండనగ నవ
తరించు నమ్మహాత్ముని పాదారవింద - సంస్పర్శకతంబున నీపాషాణా-
కారియైన యీకుమారి స్వరూపమందు ॥ముని॥

"విశ్వామిత్రుడు" (మాండ్) ధీరశంకరాభరణమేళము—ఖండగతి

నన్నుగన్నతండ్రీ - యీసరానాథు డెపుణ్య
మును జేసెనో నిన్ను తనయునిగ బడిసె భళి ॥నను॥
క్షీరశాయికిసేకు క్షీరముల నర్పించు - గోరత్నములనెంత గొప్పజేసె

దవో కడుపారగను పితలకేమర్పింపదలచితివో
శ్రీరామభద్ర నీచెలికాండ్ర కేమిడెదో ॥నను॥
నీముద్దు సుద్దులట వీక్షించుబంధువులకే - మొసగనుంచితివో, యెల్ల
వేళలనునీ - నామామృతము గ్రోలు నరుల కేమొసగెదవో-
సామాన్యమే నీమహామహిమ నెరుగగా ॥న॥

"దశరథుడు" (మాండ్) ధీరశంకరాభరణమేళం - చతురశ్రము.

ఓమునికులేంద్ర - భవదాగమనంబున - ధన్యుడనైతిన్ -
జననంబంతయు సార్థకమయ్యెన్ - సర్వశుభంబుల సంఘటిల్లె ॥నో॥
వేడెద నిటకు వచ్చినపని నాజ్ఞాపింపుడు - మీకు విధేయుడగానా -
ఆడిబొంక రీరఘువంశజు లేనాడును - సంశయమొందగనేలా ॥నో॥

"విశ్వామిత్రుడు" సురట - త్రితాల్.

ఏమని పేలుచున్నాడవుర-నికృష్టా భ్రష్టా - యీమునివరు - మహిమ
వినవో కనులగనవో చివరకిపుడు ॥ఏ॥
మునిజనముల నీకీతి పరిభవింతువా-మూఢా యిటుల్ పలుకన్ జనువా-
తనయులపై దగు ప్రేమంబుననే మరణించెదవు-యినవంశాధమ ఛీ ॥ఏ॥

"దశరథుడు" (బైస్వాం) నాదనామక్రియ - దాద్రా.

మునికులతిలకా నాముద్దుసుతుని విడువజాలా
ఘనకఠినశరీరులైన దనుజులేడా - నాతనయుడు బాలుడేడా ॥ముని॥
అనఘచరిత ముక్కుపచ్చలారని నా సుతుడా -
సునిశితశస్త్రాస్త్రములన్ - గొని కదనమొనర్చువాడా ॥ము॥
రాముపడని కన్నగ గోరకుమా (మాత్రశ్రీరాము) -
నీవీమాత్రము మమ్ము కరుణగనుమా నను-
నీమదికిన్ వచ్చినట్లు సేయుమా-కానీ రామునిమాత్ర మేమడకుమా ॥ము॥

"రాముడు" సురట—పదిమాత్రలుతాళము.

కన్నతండ్రీ మేమిరువురమును-మానికాంతునితో బోయివచ్చెద మాన

తిమ్మా ఎన్నగా మాకు మునిశుశ్రూషను-జేయుటకన్నన్ గావలసిన దేమిరా ॥క॥

భవదీయమహామంగళాచరణమహిమవలన-మౌనిపతికారుణ్యమునలనన్ బవరంబునందు విజయమునుగాంచగలము - ప్రతాపమునమనుజులన్ సంహరింపగలము.

భువనములందెల్లమీదైన్య సద్యశంబును నిలుపంగలము సంశయము విడుమయ్య

"అహల్య" కామవర్ధని—త్రితాల్.

ఆదిమధ్యాంతరహిత నిన్ దెలియనలవియా-బ్రహ్మాదులకునైన

వేదవేదాంతవేద్య యోంకారానాద - స్వరూప నమో నమస్తే

నిరుపనిర్మలసద్గుణజాలా నిఖిలభువన - వినుతచరణకమలా

స్థిరతరమునిజనలోలా - సువర్ణచేలా - సతతాశ్రితపరిపాలా ॥

త్రిశ్రగతి

గరుడగమన కుజనదమన వరదసుదన - జనకవిము...

సురమునినుత సుభగచరిత నిరతదనుజ - గణ...

చతురశ్రగతి

సరసిజలోచన దురితవిమోచన-జగదభిరామా శ్రీరఘురామా ॥ఆ॥

డైలాగ్—మోహన—ధ్రుపద్—ఆరుమాత్రలుతాళము

లోకంబుల్ మంగళముల - నేకంబులన్ గాంచుతన్

నీకృపాకటాక్షమున నిత్యవైభవములో ॥లో॥

పసులకాంతల గోరువార - లందుపాట్లను సర్వము తెలిసికొనుడు

పరపురుషుల గనయుగోరు - పడతు లహల్యయవస్థను గనుడు

...శ పతితో - పంతంబుల నాడుచుండు - భామలశారదనదలో

పల తప్పక స్మరియింపుడు

స్త్రీమణులకష్టంబుల్ - నిరంతరములో లంఘి -

...ల్లము) సుఖమొసంగు...

# వినువీథి

(శుక్లపక్షము)

ఖండకావ్యము

రచయిత: **శ్రీ అయ్యగారి విశ్వేశ్వరరావు**

......తెలుగు దేశాన్నే కాక యావద్భారత దేశాన్ని కలచి కలవరపెట్టిన అనేక సమస్యలను ఆధారంగా తీసుకొని రచింపబడిన ఖండకావ్యసంపుటియే యీవినువీథి.

......నేటి తెలుగు మాటల్ని ముద్దుగా మూటగట్టిన పద్యాలు చదివేసరికి మీరు విస్మయులవుతారు. ఇదే యీకావ్యంలో ఉండే విశిష్టత.

......హంపీ శిథిలాలు—ఆంధ్రరాష్ట్రం, తెలుగు వీరస్మృతి, ప్రకృతి పరిశీలన— అనేక వివిధశీర్షికలలో సర్వజనాకర్షణీయముగా తమ స్వాతంత్ర్యాభిమానంలో ఆవేదన చూపించారు

......మీరుకూడా ఈ వినువీథి కావ్యాన్ని చదివి మీ సాహిత్యకృషికి చేయూత నిస్తారని మా అభికాంక్ష.

తెల్లని కాగితం, ముద్దుగొలిపే గెటప్. మూల్యం 1-0-0

ముందుగా రూపాయి మణియార్డరు పంపినవారికే పంపబడును.

**కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్**

సంస్కృతాంధ్ర బుక్ డిపో, రాజమహేంద్రవరం

**Published by Kalahasti Thamm**

**Printed at Rajeswari Press, Rj**